# జోసఫ్ స్టాలిన్ యొక్క
# చరిత్రాత్మక యుపన్యాసము
# యునైటెడ్ సోషలిస్టు సోవియట్ రిపబ్లిక్
# యొక్క నూతన రాజ్యాంగ విధానము

(అనువాదకుడు)

**అన్నాప్రగడ కామేశ్వరరావు**

సంచాలకుడు



**అతివాద గ్రంథ మండలి**

గుంటూరు

0—8—0

# పీ ఠి క.

సోవియట్ రాజ్యాంగచట్టమును ఆచట్టముపై జోసఫ్ స్టాలిన్ యొక్క చారిత్రకోపన్యాసమును ప్రచురించి, సామ్య వాద విజ్ఞాన ప్రచారక సంఘమువారు మార్గదర్శకులైరి. ఈచట్టమును గురించి యనేక వాద ప్రతివాదములున్నను ఈ దేశీయులకు సంపూర్ణజ్ఞానముగలుగలేదు. కామ్రేడు స్టాలిను యొక్క యాధిపత్యముక్రింద రాజ్యాంగవిధాన చట్టనిర్మాణ సంఘము చిత్తుచట్టమును తయారుజేసి ఎక్కువకాలము కాలేదు. కాని మితవాద పక్షపత్రిక "ఈచట్టము బూర్జువా ప్రజాస్వామ్యమే తగినదని ఋజువు చేయుచున్న ద"ని ప్రకటించెను. 19వ శతాబ్దమందలి కాపిటాలిజము యొక్క ముఖ్యసూత్రములగు రహస్య నియోజకపద్ధతులు, వయోజన నియోజనాధికారము, మొదలైనవాని నన్నిం టిని సోషలిస్టు ప్రభుత్వముగల రషియాకూడా యవలంబిం చుటచేత ప్రపంచమందు కాపిటాలిజము చిరస్థాయిగా నుండ వలెనందురు. మనము సోషలిజమును అర్థముచేసికొను టయు, దాని గుణములను గ్రహించుటయు, సం. సో. సో. రి. నందు సోషలిష్టు సూత్రములను గురించి తెలిసికొనుటయు, ఇంత చక్కగానున్నది.

యుద్ధానంతరము రషియాయందలి రాజకీయ పరిస్థి తులు, ప్రపంచమంతను నాకర్షించినవి. ఫ్రెంచివిప్లవము

కన్నను, రషియాయందలి విప్లవము చరిత్రాత్మకముగా ప్రాపంచిక వైచిత్ర్యము, రషియా విప్లవముయొక్క ఫలితములుత్వరలోనే ప్రపంచమునకు ముఖ్య విషయములైనవి. వలస రాజ్యములకును, పరాధీనరాజ్యములకును, రషియా విప్లవము ఎప్పటికిని మరుపురాగూడని పాఠమైనది.

హిందూదేశమందు, రషియాయందలి విప్లవ కాలము, విప్లవానంతర పరిణామమును, ఉత్సాహముతోను సానుభూతితోను గమనించెడివారు రెండుపంచవత్సర ప్రణాళిక నిర్మాణకాలమును, ఆధునిక విప్లవవిధానమున కుపసంహారముగాను, అంతర్జాతీయప్రాముఖ్యము గలదానినిగాను నెంచెదరు. 18వ శతాబ్దమందలి ఫ్రెంచిదేశములో బూర్జువా విప్లవమువలె నెపోలియనువంటి వానిని సోషలిష్టువిప్లవము తయారుజేయలేదు. అదిగాక అది లెనిన్నును, ప్రథమ సోషలిష్టుప్రభుత్వమును సృజించినది. ప్రపంచకార్మికవర్గము విప్లవపక్షముయొక్క ఎత్తుగడలు, పద్ధతులనుండియు, విప్లవ స్వభావమునననుసరించేయిదిజరిగినది. కార్మికవర్గనియంతృత్వము వలననూ, సోషలిజస్థాపితమువలనను, అత్యున్నతమైన ప్రజాయత్త ప్రభుత్వము అమలులోనికి వచ్చినది. మన కాలమందు కాపిటాలిజముయొక్క యత్యధికాభివృద్ధివలన ఫాసిజ మేర్పడి దారిద్ర్యము, నిరుద్యోగము, క్రూరనిర్బంధములు, నిషేధములచే యనుసరింప బడుచున్నది. రషియాయందలి విప్లవము, బూర్జువావిప్లవమువలె రాజకీయప్రజాస్వామ్యమువద్ద నాగ

లేదు. అది యింకను దూరము వెళ్ళినది; కాపిటాలిజనిర్మాణ మునకు పునాదియైన ఒకమానవుడు మరొకనిని దోచుకొనుట యనెడి యార్థికసంబాధములను నిర్మూలించినది. వర్గరహిత సంఘమనెడి స్వప్నము యథార్థమైనది. సంయుక్త సోవియటు సోషలిష్టు ప్రజాస్వామ్యమందలి జాతీయ యార్థికమండలముల నుండి కాపిటలిజము తొలగింపబడినది. ఒకనూతన సోషలిష్టు యార్థికవిధానము స్థాపింపబడినది కనుక, స్టాలిను చెప్పినట్లుగా అది బీదతనము, సర్వనాశము అనునవి యెఱుగక, ప్రతి వ్యక్తికి సుఖకరమై విజ్ఞానయుతమైన జీవనమున కవకాశ మిచ్చును."

ఈ నూతన జాతీయయార్థిక విధానముయొక్క రాజకీయ స్వరూపము, ఈ నూతన ప్రజాస్వామ్య స్థాపనమే, కాపిటలిష్టు దోపిడి పద్ధతులను తొలిగించి, రాజకీయ శక్తినంతను కార్మికుల హస్తములందు కేంద్రీకరింపబడియున్న దేశమందే యిది సాధ్యపడును. ఈ పరిస్థితులు, ఫాసిష్టు, కాపిటలిష్టు, యింపీరియలిష్టు దేశములందు, కార్మికులు ప్రభుత్వమును స్వాధీనము జేసికొనకుండా ధనికవర్గంయొక్క ఆస్తిసంపదలు లాగికొని, ప్రజలు స్వాధీనం చేసికోకుండా, అత్యున్నత పారిశ్రామికాభివృద్ధి కాకుండా, సాధ్యమగునో కాదో నిర్ణయించుటను పాఠకులకు వదలెదము. రషియా యందలి కమ్యూనిష్టు పక్షమందును తదనుగుణ్యమైన మార్పు వచ్చినది. రషియా కార్మిక వర్గనియంతృత్వ సాధనమైన కమ్యూనిష్టు పక్షము, సోషలిష్టు ప్రభుత్వ సంరక్షణకర్తగా నభివృద్ధిజెంది రాజ్య

కార్య నిర్వాహణమును జాగరూకతతో చూచుచున్నది. అది కార్మికుల ప్రభుత్వము, కార్మికులచే నిర్వహింప బడుచున్నది. కార్మికుల కొఱకది ఏర్పడినది. అనగా, కార్మికులయొక్క రాజకీయ పక్షము, వారి సంయుక్త సంకల్పముయొక్క స్వరూపముగాని యన్యముగాదు. కాబట్టి రషియా కమ్యూనిస్టు పక్షముయొక్క కేంద్రకార్య నిర్వాహక సంఘముయొక్క నిండు సభయందేకగ్రీవముగా నీతీర్మానమామోదింప బడినది. మార్చి 7వ తేదీన అఖిల రషియా సోవియటు కాంగ్రెసుకు జరిగెడి ఎన్నికలయందు ప్రాధాన్యమును వహించుటయేగాక, ప్రజాస్వామ్య పద్ధతులను పక్షమందు అవలంభింప వలెనని, ఈ పక్షము తీర్మానించినది. దీని ఫలితముగా, పక్ష సభ్యులు వ్యక్తిపరమైన విమర్శన జేయు హక్కునుపయోగించుకొన గలుగుదురు; యిప్పటినుండి పార్టీ సభ్యులు రహస్య నియోజకము వలన ఎన్నుకొన బడుదురు.

నేటి చరిత్రయందు, రషియా విప్లవమొక ప్రత్యేక విషయముగాదను యంశమునుచూప ప్రయత్నించితిని. కాపిటాలిజమందు, అత్యధికాభివృద్ధి జెందియున్న నేటికాలములో, విప్లవముయొక్క తార్కిక పరిణామము కనుబడుచున్నది. రషియా రాజ్యాంగ విధానమును చదివెడి పాఠకులనీ చిన్న పొత్తము చదువ గోరెదను.

కే. యం. అష్రాఫ్.

# అధ్యాయము 1

## సాంఘిక నిర్మాణము

నిబంధనలు:—

1. సోవియటు సోషలిష్టు రిపబ్లిక్కుల సమితి, కార్మికులయొక్కయు, కర్షకులయొక్కయు సోషలిష్టు ప్రభుత్వము.

2. యు. యస్. యస్. ఆర్. యొక్క రాజకీయ ప్రతిష్టాపన, కష్టజీవుల ప్రతినిధులచే నేర్పరుపబడిన సోవియట్లవలన తయారైనది. భూస్వాముల యొక్కయు, కాపిటలిష్టులయొక్కయు, పతనముచేతను, కార్మికవర్గ నియంతృత్వముయొక్క విజయముచేతను, అవి యభివృద్ధిజెంది, బలపడెను.

3. కష్టజీవుల ప్రతినిధులు గల సోవియట్ల రూపమున సం. సో. సో. రి. నందలి యధికారమంతయు, కష్టజీవులైన గ్రామస్థులకు, పట్టణ వాసులకు జెందియున్నది.

4. సోషలిష్టు ఆర్థికవిధానముపైన, సోషలిష్టుల యధీనమం దుత్పత్తి సాధనములుండుట పైన, సం. సో. సో. రి. యొక్క ఆర్థికపునాది ఆధారపడి యున్నది. కాపిటలిష్టు ఆర్థిక విధానమును నిర్మూలము జేయుటచేతను, ఉత్పత్తి సాధనములు వ్యక్తి పరమునుండి తొలగించుట చేతను, మానవుడు తోడిమానవుని దోచుకొనుటను తొలగించుట చేతను, ఇది శాశ్వతముగా సంస్థాపింపబడినది.

ముగ పాటు బడవలెను; వానికి వాని కష్టము ననుసరించి కూలి యివ్వబడును." అనునది సాధింపబడునది.

# అధ్యాయము 2

## ప్రభుత్వ నిర్మాణము

13. సమాన హక్కులు గలిగి యిచ్ఛాను సారముగా ఏర్పరుపబడిన సంయుక్త రాష్ట్రప్రభుత్వము (ఫెడరల్ ప్రభుత్వము) ఈ సంయుక్త సోవియటు సోషలిష్టు రిపబ్లికులు.

(i) రషియా సోవియట్ సంయుక్త సోషలిస్టు రిపబ్లికు.
(ii) యుక్రేనియా సోవియటు సోషలిస్టు రిపబ్లికు.
(iii) వైటు రషియనుల సోవియటు సోషలిస్టు రిపబ్లికు.
(iv) అజర్ బైజాన్ సోవియటు సోషలిస్టు రిపబ్లికు.
(v) జార్జి సోవియటు సోషలిస్టు రిపబ్లికు
(vi) ఆర్మీనియా సోవియటు సోషలిస్టు రిపబ్లికు.
(vii) టర్కుమేనియా సోవియటు సోషలిస్టు రిపబ్లికు.
(viii) ఉజ్ బెక్ సోవియటు సోషలిస్టు రిపబ్లికు.
(ix) టాజిక్ సోవియటు సోషలిస్టు ప్రజాయత్త ప్రభుత్వము.
(x) కిజాక్ సోవియటు సోషలిష్టు ప్రజాయత్త ప్రభుత్వము.

(xi) కిర్ ఘీజ్ సోవియటు సోషలిస్టు ప్రజాప్రభుత్వము.

14. సోవియటు సోషలిస్టు రిపబ్లిక్కుల సమితియొక్క అత్యున్నతమైన ప్రభుత్వ సాధనములు, రాజ్యపరిపాలనా సాధనములయొక్క అధికార మండలము ఈ క్రిందివానికి విస్తరించును.

(a) అంతర్జాతీయ సంబంధము లందు, యితర ప్రభుత్వములతో సంధి చేసికొనుట, దాని నామోదించుట యందు సమితి యొక్క ప్రాతినిధ్యము;

(b) యుద్ధము, శాంతికి సంబంధించిన సమస్యలు;

(c) క్రొత్త ప్రజా స్వామ్యములను సం. సో. సో. రి. నందు జేర్చుకొనుట;

(d) సం. సో. సో. రి. యొక్క రాజ్యాంగ విధానము యొక్క ఆచరణను సక్రమముగా నుండునట్లు నడుపుట, సమితి యందలి రిపబ్లిక్కుల యొక్క రాజ్యాంగ విధానము సం. సో. సో. రి. యొక్క విధానముతో అనుగుణముగా నుండునటుల జేయుట,

(e) సమితి యందలి రిపబ్లికుల సరిహద్దులను మార్చుకొనుటకు సమ్మతించుట;

(f) సం. సో. సో. రి. యొక్క రక్షణోద్యమమును వ్యవస్థాపనము జేయుట, సం. సో. సో. రి. యొక్క సైనిక దళముల కు త్తర్వు లిచ్చుట;

(g) ప్రభుత్వము యొక్క విశిష్టాధికారమునకు లోబడి విదేశ వ్యాపారము;

(h) దేశరక్షణ భారమును వహించుట;

(i) సం. సో. సో. రి. యొక్క జాతీయ యార్థిక విధానములను స్థాపించుట;

(j) సం. సో. సో. రి. యొక్క యేకమైన ప్రభుత్వ ఆదాయ వ్యయ పట్టిక నామోదించుట, సం. సో. సో. రి. లోనికిని, అందలి రిపబ్లిక్కుల లోనికిని, స్థానిక బడ్జెటులలోనికి జేరెడి పన్నుల రాబడిని నిర్ణయించుట;

(k) సమితికంతకు ప్రాముఖ్యమైన ధనాగారములు, పారిశ్రామిక వ్యవసాయిక సంస్థలు, వ్యాపార సంఘములు మొదలగు వానిని పరిపాలించుట;

(l) ప్రయాణసౌకర్యములు, తపాలా మార్గములను పాలించుట;

(m) ద్రవ్యసంబంధమైన, పరపతివిషయమైన విధానమును సక్రమముగా నడుపుట;

(n) ఆస్తిని ప్రభుత్వభీమా జేయు వ్యవస్థను స్థాపించుట;

(o) ఋణములు జేయుట, అప్పులిచ్చుట;

(p) భూమి నుపయోగించుటకు, భూమినిక్షేపములు, అరణ్యములు, జలము మొదలైన ప్రకృతిశక్తుల నుపయోగించుటకు మూలసూత్రములను స్థాపించుట;

(q) విద్యావిషయమునను, ప్రజారోగ్యసందర్భము నను మూలసూత్రముల నేర్పాటుజేయుట;

(r) జాతీయ ఆర్థికముయొక్క జమాఖర్చులెఖ్ఖల సరి జూచుట కొరకు ఏకమైన విధానమును స్థాపించుట;

(s) మూలాధారమైన కాయకష్ట (లేబరు) సూత్రము లను సంస్థాపించుట;

(t) న్యాయవిచారణశాఖ, చట్టసమ్మతమైన వ్యవహార పద్ధతి, క్రిమినల్, సివిల్ ధర్మశాస్త్రముల విషయమున శాసనములను ప్రవేశపెట్టుట;

(u) సమితి పౌరసత్వమును గురించి, విదేశస్థుల హక్కులను గురించి, నిర్వచించుట;

(v) సమితియంతకు వర్తించెడి సకలాపరాధ విమో చన చట్టములను జేయుట;

**15.** సం. సో. సో. రి. యొక్క చట్టమందలి **14**వ నిబంధనచే నిశ్చితమైన హద్దులమధ్య సమితియందలి రిపబ్లి క్కుల స్వాతంత్ర్య మిమిడియుండును. ఈహద్దులలో ప్రతి రిపబ్లికు, దాని ప్రభుత్వశక్తిని స్వతంత్రముగా చెలాయించ వచ్చును. సమితి రిపబ్లికుస్వాతంత్ర్యహక్కులను సం. సో. సో. రి. కాపాడును.

16. ప్రతి సమితి ప్రజాస్వామ్యమునకు, ఒక రాజ్యాం గవిధాన ముండును. అది అచ్చటి విశిష్ట లక్షణములను పరి

నిర్ణయించును. అది సం. సో. సో. రి. యొక్క రాజ్యాంగ విధానమున కనుగుణముగా నుండును.

17. ప్రతి సమితి ప్రజాస్వామ్యమునకు సమితినుండి స్వతంత్రముగా విడిపోవు హక్కు కలిగియుండును.

18. సమితియందలి రిపబ్లిక్కుల భూభాగమును వారి సమ్మతి లేకుండా మార్చకూడదు.

19 సం. సో. సో. రి. యొక్క న్యాయసూత్రములకు అన్ని రిపబ్లిక్కులందు ఎట్టిమినహాయింపు లేకుండా సమాన శక్తి గలదు.

20. ఒక సమితి రిపబ్లికు యొక్క న్యాయసూత్రము, సమితి యంతకు వర్తించెడి న్యాయసూత్రమునకు భేదముగా నుండుట సంభవించిన, సమితి అంతకు వర్తించెడి న్యాయసూత్రమే చెల్లుబడియగును.

21. సం. సో. సో. రి. నందలి పౌరులందరికి ఒకసమితి పౌరసత్వమే స్థాపింప బడినది. సమితి రిపబ్లిక్కు నందలి ప్రతి పౌరుడు, సం. సో. సో. రి. యొక్క పౌరుడే.

22. ఈ క్రిందిది భూభాగములు రషియా సోవియటు సంయుక్త సోషలిష్టు రిపబ్లిక్కునందు గలవు. అజావ్ నల్లసముద్రము, దూర ప్రాచ్యము, పశ్చిమ సైబీరియా, క్రాస్ నోయారస్కు, ఉత్తర కకేససు; పరగణాలు: వోరానెజ్, తూర్పు సైబీరియా, గోర్కి, పశ్చిమ ఇవానొవో, కాలినిన్, కిరావ్, క్యుబిషావ్, కర్స్క, లెనినుగ్రాడ్, మాస్కో, ఓంస్కు, ఓరెం

బర్గు, స్వెర్ద్లొవ్స్కు, ఉత్తర స్టాలిను గ్రాడు, చెల్యాబిన్స్కు, యరోస్లావల్; స్వపరిపాలిత సోవియటు సోషలిస్టు రిపబ్లిక్కులు: తార్తారు, బాష్కీరు, డఘేస్టాను, బర్యాయిత్ మంగోలియా, కబర్డినో, క్రిమియా, మారీ, మోర్ద్వా, వోల్గా జర్మను, ఉత్తర ఒసేటియా, ఉద్మర్తు చెకెనింగష్, చువాష్, యాకుట్; స్వపరిపాలిత రాష్ట్రములు. అడిజ్గెల్, యూధుల కరాఛెవత్, అయిరత్, ఖకాస్, చెర్కెస్.

23. యుక్రేనియా సోవియటు సోషలిస్టు రిపబ్లికు నందు క్రింది రాష్ట్రములు గలవు:—విన్నిట్సా, నైప్రో పెట్రోవిస్క్, డోనెట్సు, కీవ్, ఒడేసా, ఖర్కావ్, చెర్నిగావ్, మఱియు మోల్డవేనియా స్వపరిపాలిత సోవియటు సోషలిస్టు రిపబ్లికు.

24. అజర్ బైజన్ సోవియటు సోషలిస్టు రిపబ్లికునందు ఈ క్రింది భాగములు గలవు. నఖిచెవాను స్వపరిపాలిత సోవియటు సోషలిస్టు రిపబ్లికు, మరియు, నగోర్నో—కరాబక్ స్వపరిపాలిత రాష్ట్రము.

25. జార్జియా సోవియటు సోషలిస్టు రిపబ్లికునందు అబ్ ఖచరెన్ స్వపరిపాలిత సో. సో. రి. అజరియన్ స్వపరిపాలిత సో. సో. రి. గలవు.

26. ఉజ్ బేక్ సో. సో. రి. నందు కరా—ఆల్ పక్ స్వపరిపాలిత సో. సో. రి. గలదు.

27. టాజికు సో. సో. రి నందు గార్నో—బడాకుషా

[illegible]తి సోవియటు సోషలిస్టు రిపబ్లికు గలదు.

28. కజకు సోవియటు సోషలిస్టు రిపబ్లికులో ఈ క్రింది ప్రాంతములు గలవు: అక్ట్యూబినుసుకు, అల్మా—అటా, కజకు స్థాను, ఉత్తరము కజకుస్థాను, కరాగండా, దక్షిణ కజకుస్థాను.

29. అర్మీనియా సో. సో. రి. బెలో రషియా సో. సో. రి.; తుర్కమేనియా సో. సో. రి.; కిర్గిజ్ సో. సో. రి.; లో స్వయంపరిపాలిత రిపబ్లిక్కులు గాని, స్వపరిపాలిత రాష్ట్రములు గాని లేవు.

# అధ్యాయము 3.

## సం. సో. సో. రి. యొక్క ప్రభుత్వపరిపాలనాశాఖలు.

30. సం. సో. సో. రి. యొక్క ప్రభుత్వశక్తికి ప్రధానమైన స్థానము సం. సో. సో. రి. యొక్క కేంద్రశాసనసభ.

31. రాజ్యాంగవిధానముప్రకారము కేంద్రశాసనసభకు లోబడియున్న సం. సో. సో. రి. యొక్క కేంద్రశాసనసభయొక్క అధ్యక్షపీఠము (presidiun) సం. సో. సో. రి. యొక్క ప్రజాకార్యనిర్వాహకవర్గము (emniessariats) యొక్క అధికారవర్తుల నదివిచారించనంతవరకు 14వ నిబంధనప్రకారము సోవియటు సోషలిస్టురిపబ్లికుల సమితిసంక్రమించినసర్వాధికారములను కేంద్రశాసనసభ చలాయించవచ్చును.

32. సం. సో. సో. రి. సందలి శాసననిర్మాణాధికారము

సం. సో. సో. రి. యొక్క కేంద్రశాసనసభకుమాత్రమేకలదు.

33. సం. సో. సో. రి. యొక్క కేంద్రశాసనసభయందు రెండుసభలుగలవు: మొదటిదిసమితిసభ(యూనియన్ కౌన్సిలు) రెండవది జాతులసభ (council of natioalities)

34. జనాభాయందలి ప్రతి300,0C0 మందికొకప్రతినిధి చొప్పున సం. సో. సో. రి. నందలి పౌరులచే యూనియను కౌన్సిలు ఎన్నుకొనబడును.

35. సమితియందున్నప్రతిరిపబ్లికు 10మంది ప్రతినిధుల చొప్పునను, ప్రతిస్వపరిపాలిత రాష్ట్రమునుండి 5గురు ప్రతి నిధులు చొప్పునను, సమితియొక్క కేంద్రశాసనసభ చేతను, రిపబ్లిక్కులశాసనసభలచేతను, స్వపరిపాలిత రిపబ్లిక్కులచేతను, స్వపరిపాలితరాష్ట్రములందలి కష్టజీవుల ప్రతినిధులుగల సోవి యట్లచేతను, జాతులసభ నియమింపబడును.

36. సం. సో. సో. రి. యొక్క కేంద్ర శాసన సభ్యులు నాలుగు సంవత్సరముల కొకతూరి ఎన్నుకొన బడుదురు.

37. కేంద్ర శాసన సభ యందలి రెండు సంఘము లకు. అనగా యూనియన్ కౌన్సిలుకు, జాతుల సభకు సమాన హక్కులు గలవు.

38. యూనియన్ కౌన్సిలుకు జాతులసభకు చట్టప్రవే శమునకు సమానహక్కు గలదు.

39. కేంద్ర శాసన సభ యందలి రెండు సంఘము

లం ధథికే సంఖ్యాకు లామోదించిన యెడల ఒక చట్టము నెగ్గిన దని చెప్పవచ్చును;

**40.** సం. సా. సా. రి. యొక్క కేంద్ర శాసన సభ చేత యామోదింప బడిన చట్టములు. సం. సా. సా. రి. యొక్క కేంద్ర శాసన సభాధ్యక్ష పీఠముయొక్క అధ్యక్షుడు కార్య దర్శి దస్కతులతో ప్రచురింపబడును.

**41.** యూనియను కౌన్సిలు జాతుల సభ యొక్క సమావేశములు ఒకే కాలమున ప్రారంభింప బడి యేక కాల మందు ముగింప బడును;

**42.** యూనియన్ కౌన్సిలు ఒక సభాధ్యక్షుని, యిరువురు ఉపాధ్యక్షులను ఎన్నుకొనును;

**43.** యూనియన్ కౌన్సిలు, జాతుల సభలయొక్క అధ్యక్షులు, ఈ రెండు సభల సమావేశములను వారి కనుకూలమైన కాలమందు జరిపి, వానియందలి కార్యక్రమమును సక్రమముగా నడుపుదురు.

**44.** సం. సా. సా. రి. యొక్క కేంద్ర శాసన సభ యందలి రెండు సభలు కలియుటను యూనియను కౌన్సిలు అధ్యక్షుడు, జాతుల సభయొక్క అధ్యక్షుడు నిర్ణయించెదరు.

**45.** సం. సా. సా. రి. యొక్క కేంద్రశాసనసభాసమావేశము సం. సా. సా. రి. యొక్క కేంద్రశాసన సభాధ్యక్ష పీఠముచే సంవత్సరమునకు రెండుపర్యాయములు జరుపబడును;

46. అత్యవసరసమావేశములు కేంద్రశాసనసభాధ్యక్ష పీఠముయొక్క ఆజ్ఞానుసారముగా నైనను, లేక ఒకసమితి రిపబ్లికుయొక్క కోరిక చేనైనను, జరుపబడును.

47. యూనియన్ కౌన్సిలుకు జాతులసభకు యభిప్రాయభేదము కలిగినయెడల, ఆసమస్యను పరిష్కారము జేయుటకొక రాజీసంఘమునకు యభిప్రాయార్థము పంపబడును. ఆసంఘమునందు రెండుసభలకు సమానప్రాతినిధ్యముండవలెను. ఈరాజీసంఘముకూడా ఎట్టినిర్ణయమునకు రాజాలకపోయినను, దానిపరిష్కారమొక సభకైనను యసంతృప్తికరముగా నున్నను, ఆసమస్య మరొకపర్యాయము చాంబర్లయం దాలోచింప పంపబడును.ఆరెండుసభలు మరల సమాధానపడకపోయిన యెడల సం. సో. సో. రి. యొక్క కేంద్ర శాసనసభాధ్యక్షపీఠము, కేంద్రశాసనసభను రదుజేసి మరల నూతన ఎన్నికలను ఏర్పాటుజేయును.

48. రెండుసభల (యూనియన్ కౌన్సిలు, జాతులసభ) యొక్క సంయుక్తసమావేశమునందు కేంద్రశాసనసభ దానియొక్క అధ్యక్షపీఠమును ఎన్నుకొనును. దానియందు అధ్యక్షపీఠముయొక్క అధ్యక్షుడు, నలుగురు ఉపాధ్యక్షులు, కార్యదర్శి, అందలి 31 సభ్యులు వుందురు.

సం. సో. సో. రి. యొక్క కేంద్రశాసన సభాధ్యక్ష పీఠము, వారి వ్యవహారములందు కేంద్రశాసనసభకు బాధ్యులై యుందురు.

49. సం. సో. సో. రి. యొక్క కేంద్ర శాసనసభా ధ్యక్ష పీఠము.

(a) సం. సో. సో. రి. యొక్క కేంద్ర శాసనసభా సమావేశములను జరుపును.

(b) అమలునందున్న న్యాయ సూత్రములను తగిన యుత్తర్వులచే వివరించును.

(c) సం. సో. సో. రి. యొక్క రాజ్యాంగ విధాన మందలి 47 వ నిబంధనాను సారముగ, సం. సో. సో. రి. కేంద్ర శాసనసభను పరిసమాప్తిజేసి. తిరిగి క్రొత్త ఎన్ని కలను జరుపును.

(d) దానియంతట యదిగాని, లేక ఒకసమితి రిపబ్లికు యొక్క కోరికపై గాని, దేనినైనను ప్రజాభిప్రాయము కొరకు ప్రచురించ వచ్చును.

(e) సం. సో. సో. రి. యొక్క ప్రజాకార్యనిర్వాహక వర్గము యొక్కగాని, రిపబ్లికులందలి ప్రజాకార్య నిర్వాహక వర్గములయొక్కగాని, నిర్ణయములను ఉత్తరువులను న్యాయ సమ్మతము గానియెడల రద్దు చేయవచ్చును.

(f) సం. సో. సో. రి. యొక్క కేంద్ర శాసనసభా సమావేశముల మధ్యకాలమందు, వాని విలయనము తద నంతరము, సం. సో. సో. రి. యొక్క ప్రజా కార్యనిర్వాహక వర్గముయొక్క అధ్యక్షుని విన్నపము పైనను, సం. సో. సో. రి. లో వివిధ ప్రజా కార్యనిర్వాహకులను నియమింతురు,

దానిని సం. సో. సా. రి. యొక్క కేంద్రశాసనసభ యామో దమునకు దాఖలు చేయబడును.

(g) సం. సా. సా. రి. నందలి బిరుదులను ప్రసా దించును.

(h) క్షమాపణ హక్కులను వినియోగించు కొనును

(i) సం. సా. సా. రి. యొక్క సైనిక దళముల సర్వ సైన్యాధిపతిని నియమించుటయు, తొలగించుటయు జేయును.

(h) సం. సా. సా. రి. పై ఆయుధ ముట్టడి సమయ మున కేంద్ర శాసన సభా సమావేశముల మధ్య కాలమందు, యుద్ధపరిస్థితు లేర్పడినవని ప్రకటింప వచ్చును.

(k) ప్రజ లందరినిగాని, కొందరిని మటుకేగాని సైనికులుగా చేర వలెనని ప్రకటింప వచ్చును.

(l) అంతర్జాతీయ సంధి షరతుల నామోదించును.

(m) విదేశ ప్రభుత్వములకు సం. సా. సా. రి. యొక్క సర్వాధికార మివ్వబడిన రాయభారులను నియమించ వచ్చును. వారిని తొలగింప వచ్చును.

(n) విదేశ ప్రభుత్వ రాయభారులయొక్క యోగ్య తా పత్రములను అంగీకరింప వచ్చును.

50. యూనియను కౌన్సిలు, జాతుల సభ యోగ్యతా యోగ్యతల విచారణ సంఘములను ఎన్నుకొనును. ప్రతి

సభయందలి ప్రతినిధుల ఎన్నికలు సక్రమముగా జరిగినది లేనిది విచారించును.

ఈ యోగ్యతా యోగ్యతల విచారణ సంఘము యొక్క సలహా పైని, సభలు ఆ ప్రతినిధియొక్క అర్హతను అంగీకరించుటగాని, అతని యొక్క ఎన్నికను రద్దుపరచుట గాని, నిర్ణయించును.

51. సం. సా. సా. రి. యొక్క కేంద్ర శాసన సభ దాని కవసరమని తోచినప్పుడు, ఏ సమస్య నైనను విచారించు విచారణ సంఘమును గాని, లెక్కలను తనిఖీ చేయు సంఘమును గాని నియమించ వచ్చును.

అన్ని సంస్థలు, అందరు ఉద్యోగస్తులు, ఈ విచారణ సంఘముల యొక్క యభీష్ట ప్రకారము ప్రవర్తింపవలెను. వారికి కావలసిన పత్రములు, సాధనములు సమకూర్పవలెను.

52. సం. సా. సా. రి. యొక్క కేంద్ర శాసనసభ యొక్క యనుమతి లేనిది శాసన సభ్యునిపై ఫిర్యాదు జేయుటకుగాని, ఖైదుచేయుటకుగాని వీలులేదు. కేంద్రశాసనసభా సమావేశముల మధ్యకాలమందు, సం. సా. సా. రి. యొక్క కేంద్రశాసనసభాధ్యక్షపీఠము యొక్క యనుమతి యుండవలెను.

53. కేంద్ర శాసనసభ యొక్క అధికారాంతమునను, కేంద్ర శాసనసభా విలయానంతరమునను, సం. సా. సా. రి. యొక్క కేంద్రశాసన సభాధ్యక్షపీఠము అధికారము వహించి,

నూతనముగా కేంద్ర శాసనసభను ఎన్నుకొనువరకు, దాని యధ్యక్షపీఠము నెన్నుకొను వరకు, పరిపాలించును.

54. సం. సో. సో. రి. యొక్క కేంద్రశాసనసభాధికారాంత మందునను, కేంద్రశాసనసభా విలయానంతర మందును, అధికారాంతముగాని విలయముగాని యైన తరువాత రెండునెలల లోగా సం. సో. సో. రి. యొక్క కేంద్ర శాసనసభాధ్యక్షపీఠము క్రొత్త ఎన్నికలను జరుపును.

55. పాత కేంద్రశాసనసభా ధ్యక్షపీఠము, ఎన్నికలు జరిగిన ఒక నెలలోగా, కేంద్రశాసనసభా సమావేశమును జరుపవలెను.

56. సం. సో. సో. రి. యొక్క కేంద్ర శాసనసభ యొక్క సంయుక్త సమావేశమందు సం. సో. సో. రి. యొక్క ప్రభుత్వ కార్యనిర్వాహకవర్గమును ఏర్పాటు జేయును. అది సం. సో. సో. రి యొక్క ప్రజా కార్యనిర్వాహక వర్గము.

# అధ్యాయము 4.

## సమితి రిపబ్లిక్కులందలి ప్రభుత్వ కార్యనిర్వాహక సాధనములు.

57. సమితియందలి రిపబ్లికునందు రాజ్యపాలనా సాధనము సమితి ప్రజాస్వామ్య మందలి కేంద్ర శాసనసభ.

58. ఆ రిపబ్లికు నందలి పౌరులు శాసనసభా సభ్యులను నాలుగు సంవత్సరముల కొకతూరి ఎన్నుకొందురు.

యూనియన్ రిపబ్లికులందున్న రాజ్యాంగవిధానము ననుసరించి ప్రాతినిధ్యముయొక్క పరిమాణమును నిర్ణయింతురు.

59. సమితి ప్రజాస్వామ్య మందలి శాసనసభయే, ఆ ప్రజాస్వామ్యము నందలి ముఖ్యమైన శాసన నిర్మాణ సాధనము.

60. సమితి రిపబ్లికుయొక్క శాసనసభ:—

(a) రిపబ్లికుయొక్క రాజ్యాంగ విధానమును స్వీకరించును. సం. సో. సో. రి. యొక్క రాజ్యాంగ విధానమందలి 16 వ నిబంధన ననుసరించి దానిని సవరణ జేయుదురు.

(b) దాని యంతర్గతమైన స్వపరిపాలిత రిపబ్లిక్కుల యొక్క రాజ్యాంగ విధానము నామోదించును. దానియొక్క సరిహద్దులను నిర్ధారణ జేయును.

(c) జాతీయ ఆర్థిక విధానమును, ఆ రిపబ్లికుయొక్క ఆదాయ వ్యయపట్టికను ఆమోదించును.

(d) సమితి ప్రజా స్వామ్యమందలి న్యాయ విచారణ శాఖచే శిక్షింపబడిన నేరస్థుని క్షమింపవచ్చును.

61. సమితి రిపబ్లికుయొక్క శాసనసభ దానియొక్క

అధ్యక్ష పీఠమును ఎన్నుకొనును. సమితి ప్రజాస్వామ్యము నందలి కేంద్ర శాసన సభాధ్యక్ష పీఠమందు అధ్యక్షుడు, ఉపాధ్యక్షులు, సభ్యులు ఉందురు.

యూనియను రిపబ్లికుయొక్క కేంద్ర శాసనసభాధ్యక్ష పీఠముయొక్క అధికారము, ఆరిపబ్లికు రాజ్యాంగ విధానముచే నిర్ణయింపబడును.

62. సమితి రిపబ్లికుయొక్క శాసనసభ, సమావేశములు జరుపుటకు, అధ్యక్షుని, ఉపాధ్యక్షులను ఎన్నుకొందురు.

63. యూనియన్ రిపబ్లికుయొక్క కేంద్రశాసనసభ, ఆరిపబ్లికుయొక్క రాజ్యపరిపాలనావర్గమును నిర్మించును. సమితి ప్రజాస్వామ్యముయొక్క ప్రజాకార్యనిర్వాహకుల సభయది.

# అధ్యాయము 5.

## సోవియటు రిపబ్లిక్కుల సమితియొక్క రాజ్యపరిపాలనా సాధనము

**64.** సోవియటు సోషలిష్టు రిపబ్లికుల సమితియొక్క రాజ్యపరిపాలనము, కార్యనిర్వహణము జేయు ముఖ్యమైన ప్రభుత్వసాధనము. సం. సో. సో రి. యొక్క ప్రజాకార్య నిర్వాహకవర్గము (Peoples' commissariat).

65. ప్రజాకార్యనిర్వాహకులసభ, సం. సా. సా. రి. యొక్క కేంద్రశాసనసభకు బాధ్యతవహించి ఉండును.

66. సం. సా. సా. రి. యొక్క ప్రజాకార్యనిర్వాహక వర్గము. అమలునందున్న న్యాయసూత్రముల యాధారము పైనను, వాని నిర్వహణమునకును, ఉత్తరువులను, నిర్ణయము లను జారీచేయును వాని నిర్వాహణాధికారము వహించును.

67. సం. సా. సా. రి. యొక్క ప్రజాకార్యనిర్వాహక వర్గములయొక్క నిర్ణయములు, ఉత్తరువులు, సం. సా. సా. రి. నందున్న విశాలభూభాగమునందంతటను విధిగా నాచరణ యందుంచవలెను.

68. సం. సా. సా. రి. యొక్క ప్రజాకార్యనిర్వాహక వర్గము:—

(a) సమితియం దంతటను, సమితియందున్న రిపబ్లి క్కుల ప్రజాకార్యనిర్వాహకవర్గముల పనుల నైక్యముజేసి సక్రమపథమున నడుపును. దాని యధీనమందున్న యితర ఆర్థిక వైజ్ఞానికసంస్థల పనులను ఏకముజేసి, ముందునకు నడుపును.

(b) జాతీయఆర్థికవిధానమును ప్రభుత్వ ఆదాయవ్య యపట్టికను నిర్వహించుటకు ధనపరపతిపద్ధతినిబలపరుచుటకు తగినయేర్పాట్లుజేయును.

(c) ప్రజలు న్యాయసూత్ర బద్ధులుగా నుండుట, ప్రభుత్వ ప్రయోజనమును కాపాడుట, పౌరుల పౌరసత్వ

హక్కులను రక్షించుటకు కావలసిన ఏర్పాట్లు జేయును.

(d) విదేశప్రభుత్వ సంబంధవిషయమున సాధారణ వుత్తర్వులనిచ్చును.

(e) ప్రతివత్సరమందు సైన్యమందు జేరవలసిన పౌరులసంఖ్యను నిర్ణయించును. దేశమందలి సైనికబలముయొక్క అభివృద్ధికై యుత్తర్వులనిచ్చును.

69. సం. సో. సో. రి. యొక్క ప్రజా కార్యనిర్వాహక వర్గము వారికి, సం. సో. సో. రి. యొక్క యధికార మండల మందున్న రాజ్యాంగ పరిపాలనాశాఖలందు, యూనియను రిపబ్లిక్కులలోని కార్యనిర్వాహక వర్గముల నిర్ణయములను ఉత్తరువులను త్రోసివేయుహక్కు, సం. సో. సో. రి. యొక్క కార్యనిర్వాహకుల యొక్క నిర్ణయములను ఉత్తరువులను రద్దుజేయ హక్కుగలదు.

70. ప్రజా కార్యనిర్వాహక వర్గము, సం. సో. సో. రి. యొక్క కేంద్ర శాసనసభచే నిర్మింప బడినది. అది ఈ క్రింది విధముగానుండును:—

సం. సో. సో. రి. యొక్క ప్రజాకార్య నిర్వాహకుల సభాధ్యక్షుడు.

సం. సో. సో. రి. యొక్క ప్రజాకార్య నిర్వాహకుల సభకు ఉపాధ్యక్షుడు.

సం. సో. సో. రి. యొక్క ప్రభుత్వవిధాన విచారణ సంఘాధ్యక్షుడు.

సోవియటు అధికారనిర్ణయ సంఘాధ్యక్షుడు.

సం. సో. సో. రి. యొక్క ప్రజా కార్యనిర్వాహకులు.

వ్యవసాయిక వస్తువులను కొను కమిటీయొక్క అధ్యక్షుడు.

కళల యుపసంఘము యొక్క అధ్యక్షుడు.

ఉన్నత విద్యా సంఘాధ్యక్షుడు.

71. సం. సో. సో. రి. యొక్క ప్రభుత్వము, అనగా; సం. సో. సో. రి. యొక్క ప్రజా కార్య నిర్వాహక వర్గము నకు కేంద్ర శాసన సభా సభ్యుని యొక్క ప్రశ్నను విచారింప బడిన వారు దానికి సమాధానములును, అది యందిన మూడు దినములలోగా, ఆ సభ్యుడు ఏ సభయందు మెంబ రైన, ఆ సభయందు వ్రాత మూలముగా నైన, మాటల మూలముగా నైనను, విధిగానందజేయ వలెను.

72. సం. సో. సో, రి. యొక్క యధికారమునందున్న ప్రభుత్వపరిపాలనా శాఖలను ప్రజాకార్య నిర్వాహక వర్గము నడుపును.

73. సం. సో. సో. రి. యొక్క ప్రజాకార్య నిర్వాహక వర్గము, అందలి ప్రతి ప్రజా హితైక మంత్రి యధీనమందున్న ప్రభుత్వశాఖలో వారి హద్దులలో ఉత్తరువులుగాని యుపదేశములు గాని చేయవచ్చును. అమలునందున్న న్యాయ సూత్రముల యాధారము పైనను, వాని సంపూర్తికిని, ప్రజా కార్యనిర్వాహకవర్గము యొక్క ఉత్తరువులుగాని నిర్ణయము

# అధ్యాయము 6

## సమితి యందలి ప్రజాప్రభుత్వ నిర్వహణ సాధనము

79. సమితియందలి రిపబ్లికులోని కార్యనిర్వాహ
రాజ్యపరిపాలనముజేయు ముఖ్యమైన ప్రభుత్వపరిప
సాధనము రిపబ్లికు ప్రజాకార్యనిర్వాహక వర్గము.

80. సమితి ప్రజాస్వామ్యకార్యనిర్వాహక వ
ఆ రిపబ్లికునందలి శాసనసభకు బాధ్యులై యుండును.

81. సం. సో. సో. రి. నందుగాని, ఆ రిపబ్లికు
గాని, అమలులోనున్న న్యాయసూత్రముల యాధార
నను, వాని సంపూర్తికొరకును, ఆ సమితి రిపబ్లికులోని
కార్యనిర్వాహకవర్గము నిర్ణయములను, ఉత్తరు
యిచ్చును. సం. సో. సో. రి. యొక్క నిర్ణయములు, ఆ
నిర్వర్తింపబడుచున్నవో లేవో విచారించి తదనుగుణమ
నుత్తరువుల నివ్వవచ్చును.

82. స్వపరిపాలిత రిపబ్లికుల యొక్క గాని
కార్యనిర్వాహక వర్గములయొక్క గాని, పరగణాల యం
రాష్ట్రము లందలి కష్టజీవుల ప్రతినిధులుగల సోవిం
యొక్కగాని, స్వపరిపాలిత రాష్ట్రములయొక్క సోవిం
యొక్కగాని, ఉత్తరువులను, నిర్ణయములను, యూని
రిపబ్లికు ప్రజా కార్యనిర్వాహక వర్గము రద్దుచేయ వచ్చు

# అధ్యాయము 6

## సమితి యందలి ప్రజాప్రభుత్వ నిర్వహణ సాధనములు

79. సమితియందలి రిపబ్లికులలోని కార్యనిర్వహణము, రాజ్యపరిపాలనము జేయు ముఖ్యమైన ప్రభుత్వపరిపాలనా సాధనము రిపబ్లికు ప్రజాకార్యనిర్వాహకవర్గము.

80. సమితి ప్రజాస్వామ్యకార్యనిర్వాహక వర్గము, ఆ రిపబ్లికునందలి శాసనసభకు బాధ్యులై యుండును.

81. సం. సో. సో. రి. నందుగాని, ఆ రిపబ్లికునందు గాని, అమలులోనున్న న్యాయసూత్రముల యాధారముపై నను, వాని సంపూర్తికొరకును, ఆ సమితి రిపబ్లికులోని ప్రజా కార్యనిర్వాహకవర్గము నిర్ణయములను, ఉత్తరువులను యిచ్చును. సం. సో. సో. రి. యొక్క నిర్ణయములు, ఆజ్ఞలు నిర్వర్తింపబడుచున్నవా లేవో విచారించి తదనుగుణముగా నుత్తరువుల నివ్వవచ్చును.

82. స్వపరిపాలిత రిపబ్లికుల యొక్క గాని ప్రజా కార్యనిర్వాహక వర్గములయొక్క గాని, పరగణాల యందలి రాష్ట్రము లందలి కష్టజీవుల ప్రతినిధులుగల సోవియట్ల యొక్కగాని, స్వపరిపాలిత రాష్ట్రములయొక్క సోవియట్ల యొక్కగాని, ఉత్తరువులను, నిర్ణయములను, యీనియును రిపబ్లికు ప్రజా కార్యనిర్వాహక వర్గము రద్దుచేయ వచ్చును.

౮౩. యూనియను రిపబ్లికుయొక్క శాసనసభచే ప్రజా కార్యనిర్వాహకవర్గము నియమింప బడినది. అందు ఈ క్రింది వారుందురు:—

యూనియను రిపబ్లికుయొక్క ప్రజా కార్యనిర్వాహక సభాధ్యక్షుడు; ఉపాధ్యక్షుడు; ప్రభుత్వవిధాన విచారణ సంఘాధ్యక్షుడు; ప్రజాకార్య నిర్వాహకులు: ఆహారపదార్థ యుత్పత్తి పరిశ్రమ యొక్కయు; తేలికసామగ్రి తయారుజేయు పరిశ్రమ యొక్కయు; కఱ్ఱ పరిశ్రమ యొక్కయు; వ్యవసాయము యొక్కయు; ప్రభుత్వ ధాన్యయుత్పత్తి ఫారములు, జంతు వృద్ధి ఫారముల యొక్కయు; దేశాదాయము యొక్కయు; స్వదేశ వ్యాపారముల యొక్కయు; న్యాయ విచారణశాఖ యొక్కయు; ఆరోగ్యశాఖ యొక్కయు; విద్యాశాఖ యొక్కయు; స్థానిక పరిశ్రమాగారములు; సంఘములయొక్క ఆర్థికము; సంఘ శ్రేయస్సు; వ్యవసాయ కోత్పత్తిసామగ్రుల క్రయకమిటీ ప్రతినిధి; కళల పాలనాసంఘముయొక్క నాయకుడు; సర్వసమితి ప్రజాకార్య నిర్వాహకుల ప్రతినిధులు.

84. యూనియను రిపబ్లికు ప్రజాకార్యనిర్వాహకులు వారి యధీనమందున ప్రభుత్వపాలనాశాఖను పరిపాలించెదరు.

85. సం. సో. సో. రి. నందును, యూనియన్ రిపబ్లికు నందును అమలునందున్న న్యాయసూత్రముల యాధారము పైనను, వాని సంపూర్తికిని, సం. సో. సో. రి. ప్రజాకార్య నిర్వాహకవర్గము యొక్కగాని, సమితి రిపబ్లికు ప్రజాకార్య నిర్వాహకవర్గము యొక్కగాని, నిర్ణయములను, ఆజ్ఞలను,

యూనియను రిపబ్లికునందలి ప్రభుత్వశాఖ యొజ్ఞలను ఉత్తరువులను సంపూర్తిజేయుటకు, యూనియను రిపబ్లికు ప్రజాకార్యనిర్వాహకులు, వారి యధీనమందున్న శాఖలకు ఉత్తరువులను, ఆదేశములను చేయవచ్చును.

86. యూనియన్ రిపబ్లికునందలి ప్రజాకార్యనిర్వాహకశాఖలు, ఒక యూనియను రిపబ్లికుకుగాని, ఒకరిపబ్లికుకు మాత్రమేగాని వర్తించును.

87. యూనియను రిపబ్లికు యొక్క ప్రజాప్రభుత్వపరిపాలనాశాఖలు, వారి యధీనమందున్న శాఖలను, యూనియను రిపబ్లికు ప్రజాకార్యనిర్వాహకవర్గమునకు, తదనుగుణమైన సం. సో. సో. రి. నందలి ప్రభుత్వశాఖలోబడి, పరిపాలించును.

88. యూనియను రిపబ్లికునందలి రిపబ్లికుయొక్క ప్రజాకార్యనిర్వాహక శాఖలను, యూనియను రిపబ్లికు ప్రజాకార్యనిర్వాహకవర్గమునకు లోబడి, ఆ రిఫబ్లికునందలి ప్రజాకార్యనిర్వాహకవర్గము పరిపాలించును.

# అధ్యాయము 7

## స్వపరిపాలిత సోవియటు సోషలిస్టు రిపబ్లికు నందలి ప్రభుత్వ పరిపాలనా సాధనములు.

89. స్వపరిపాలిత రిపబ్లికు యొక్క ప్రభుత్వపరిపాలనాసాధనము ఆ రిపబ్లికు యొక్క శాసనసభ.

90. ఆశాసనసభా సభ్యులను, ఆ రిపబ్లికునందలి పౌరులు నాలుగు సంవత్సరముల కొకతూరి ఎన్నుకొందురు. స్వపరిపాలిత రిపబ్లికుయొక్క రాజ్యాంగవిధానము ననుసరించి ప్రతినిధులు నిర్ణయింపబడుదురు.

91. స్వపరిపాలిత రిపబ్లికునందలి శాసనసభ కొక దానికి మాత్రమే శాసననిర్మాణాధికారము గలదు.

92. ప్రతిస్వపరిపాలిత రిపబ్లికునకు రాజ్యాంగవిధానము గలదు. అది ఆ రిపబ్లికు యొక్క ముఖ్యలక్షణములపై నాధారపడి యుండును. అది యూనియను రిపబ్లికు యొక్క రాజ్యాంగవిధానమున కనుగుణముగా నుండును.

93. స్వపరిపాలిత రిపబ్లికుయొక్క శాసనసభ, దాని యొక్క అధ్యక్షపీఠమును, ప్రజాకార్యనిర్వాహకవర్గమును, దాని రాజ్యాంగవిధానము ననుసరించి, ఏర్పాటుజేయును.

# అధ్యాయము 8

## ప్రభుత్వపరిపాలనకు స్థానిక సాధనములు

94. భూభాగములందు, రాష్ట్రములందు, స్వపరిపాలిత రాష్ట్రములోను, పరగణాలయందు, జిల్లాలలో, నగ

రములందు, గ్రామములందు (Stanitsas, Khutors, Kishlaks and auls). కష్టజీవుల ప్రతినిధులు గల సోవియెట్లు.

95. ఆ భూభాగములు, రాష్ట్రములు, స్వపరిపాలిత రాష్ట్రములు, పరగణాలు, జిల్లాలు, పట్టణములు, పల్లెలందున్న కష్టజీవులచే ప్రతినిధులు రెండు సంవత్సరముల కొకతూరి, సోవియట్లకు ఎన్నుకొన బడుదురు.

96. కష్టజీవుల ప్రతినిధులుగల సోవియట్ల యందలి సభ్యుల సంఖ్య, ఆ యూనియను రిపబ్లికుయొక్క రాజ్యాంగ విధానముచే నిర్ణయింపబడును.

97. కష్టజీవుల ప్రతినిధులుగల సోవియట్లు, వాని యధీనమందున్న రాజ్యపాలనా సాధనముల కార్యక్రమమును నడుపును. దేశశాంతి భద్రతలను కాపాడును. ప్రజలు చట్టబద్ధులు గానుండునట్లు జేయును. పౌరసత్వపు హక్కులను రక్షించును. స్థానిక ఆర్థిక వైజ్ఞానిక నిర్మాణమును నిర్వహించును. స్థానిక ఆదాయ వ్యయ పట్టికను తయారుజేయును.

98. సం. సో. సో. రి. యొక్కయు యూనియను రిపబ్లికు యొక్కయు న్యాయచట్టములచే వారికి సంక్రమించిన హక్కులహద్దులలో, ఆసోవియెట్లు నిర్ణయములు చేయవచ్చును ఉత్తరువులను జారిచేయవచ్చును.

99 ఈ భూభాగములు, రాష్ట్రములు, స్వపరిపాలిత రాష్ట్రములు, పరగణాలు, జిల్లాలు, నగరములు, గ్రామము

లందలి కష్టజీవుల ప్రతినిధులుగల సోవియట్ల యాజ్ఞలను అమలుపరచునట్టి సాధనము దాని కార్యనిర్వాహక వర్గము. దానియందొక అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, సభ్యులు వుందురు.

100. గ్రామకష్ట జీవుల ప్రాతినిధ్యముగల సోవియట్లు, యొక్క కార్యనిర్వాహణము జేయునట్టి, పరిపాలించునట్టి సాధనము దాని కార్యనిర్వాహకవర్గము. యూనియను రిపబ్లికు యొక్క రాజ్యాంగ విధానము ననుసరించి అధ్యక్షుని, ఉపాధ్యక్షుని, సభ్యులను ఎన్నుకొందురు.

101. కష్టజీవుల ప్రతినిధులుగల సోవియట్ల కార్యనిర్వాహకవర్గము, వారి నెన్నుకొనిన సోవియట్లకును, అత్యున్నతసోవియటు యొక్క కార్యనిర్వాహకవర్గమునకు బాధ్యులైయుందురు.

# అధ్యాయము 9.

## న్యాయస్థానములు, అపరాధ నిరూపణ.

102. సం. సో. సో. రి. యొక్క అత్యున్నత న్యాయస్థానముచేతను, యూనియన్ రిపబ్లికుల ఉన్నత న్యాయస్థానములచేతను, భూభాగములందలి, రాష్ట్రములందలి ఉన్నత న్యాయ స్థానములచేతను, స్వపరిపాలిత రాష్ట్రములందున్న న్యాయస్థానములచేతను, సం. సో. సో. రి. యొక్క కేంద్ర శాసనసభచే నియమింపబడిన ప్రత్యేక న్యాయస్థానముల

చేతను పీపుల్సు కోర్టులచేతను. సం. సో. సో. రి. నందు న్యాయ పరిపాలన జరుపబడును.

103. అన్ని కోర్టులలో ప్రజాహితైక న్యాయాధిపతులచే కేసులన్నియు విచారించబడును. చట్టసమ్మతముగా వదలివేయబడిన కేసులు తప్ప తదితరములను వీరువిచారింతురు.

104. సం. సో. సో. రి. నందలి అత్యున్నత న్యాయస్థానము ఉత్తమ న్యాయవిచారణ సాధనము. సం .సో. సో.రి. నందలి, యూనియను రిపబ్లికు లందలి న్యాయస్థానములను తనిఖీజేయుట వారికప్పగింపబడినది.

105. సం. సో. సో. రి. యొక్క అత్యున్నత న్యాయస్థానము, అందలి ప్రత్యేకన్యాయ స్థానములు, సం. సో. సో. రి. యొక్క కేంద్రశాసనసభచే 5 సంవత్సరముల కొకతూరి ఎన్నుకొనబడును.

106. యూనియను రిపబ్లికు లందలి శాసన సభలచ్చటి యున్నత న్యాయ స్థానములను 5 సంవత్సరముల కొకసారి ఎన్నుకొనును.

107. స్వపరి పాలిత ప్రజా స్వామ్యము లందలి శాసనసభలు, వానియందలి న్యాయాధీశులను 5 సంవత్సరముల ముల కొకతూరి ఎన్నుకొందురు.

108. భూభాగము, రాష్ట్ర న్యాయాధిపతులు, స్వపరి పాలిత రాష్ట్రము న్యాయాధి పతులను, ఆ భూభాగము,

లేక రాష్ట్రము, లేక స్వపరి పాలిత రాష్ట్రము లందలి కష్ట జీవుల ప్రతినిధులుగల సోవియట్లచే నియమింప బడును. వారు 5 సంవత్సరము లుద్యోగ మందుండెదరు.

109. ప్రజల కోర్టులు ఆజిల్లాయందలి పౌరులచే సార్వజనీన ప్రత్యక్ష నియోజకముచే రహస్య వోటింగుతో మూడు సంవత్సరములకు ఒకతూరి ఎన్నుకొన బడుదురు. అందలి వోటర్లకు సమాన హక్కులు గలవు.

110. కోర్టు వ్యవహారములను ఆ యూనియనందలి స్వపరి పాలిత రిపబ్లిక్కునందలి, స్వపరిపాలిత రాష్ట్రమునందు, వాడుకలోనున్న భాషలో జరుపబడును. ఆ భాష తెలియనివానికి ఒక భాషాంతరీ కరణవేత్తచే కేసుకు సంబంధించిన సర్వ విషయములు నివేదించు ఏర్పాటు జేయబడును. ఆనేరస్థుడు మాతృభాషలో కోర్టునకు సంగతి సందర్భములను విన్నవించుకొనవచ్చును.

111. చట్టమువలన వదలివేయబడిన కేసులు తప్ప తదితర నేరములు, సం. సో. సో. రి. నందలి న్యాయస్థానము లన్నింటిలోను బహిరంగముగా విచారింపబడును. నేరస్థులకు ప్రతివాదన హక్కుగలదు

112. న్యాయాధిపతులు సర్వ స్వతంత్రులు. కాని న్యాయబద్ధులు.

113. ప్రజా కార్యనిర్వాహణ శాఖలందు, వారి యధీనమందున్న సంస్థలందు ఉద్యోగస్థులు, సం. సో. సో. రి. పౌరులు

న్యాయపాలనము జేయుచున్నారో లేదో అని విచారించువాడు సం. సా. సా. రి. యొక్క ప్రాసిక్యూటర్ (ప్రభుత్వ వాదనోద్యోగి).

114. సం. సా. సా. రి. యొక్క ప్రాసిక్యూటర్ కేంద్ర శాసనసభచే యేడు సంవత్సరముల కాలమునకు నియమింపబడును.

115. రిపబ్లికు లందలి, భూభాగములందు, రాష్ట్రములు, స్వపరిపాలిత రాష్ట్రములలోను ప్రాసిక్యూటర్లు, సం. సా. సా. రి. యొక్క ప్రాసిక్యూటరుచే నియమింప బడుదురు. వారు ఉద్యోగమునందు 5 సంవత్సరములు వుందురు.

116. జిల్లా ప్రాసిక్యూటర్లు, 5 సంవత్సరములు పర్యంతము యూనియన్ రిపబ్లికు లందలి ప్రాసిక్యూటర్లచే, సం. సా. సా. రి. యొక్క ప్రాసిక్యూటరుయొక్క ఆమోదమునుబడసి, నియమింతురు.

117. నేరనిరూపణ సాధనములు ఎట్టి స్థానిక సాధనము లుండినను వానినుండి స్వతంత్రులుగానుండి తమ కార్యనిర్వాహణము జేయుదురు. వారు సం. సా. సా. రి. యొక్క ప్రాసిక్యూటరునకు మాత్రమే బాధ్యులై యుందురు.



120. సం. సో. సో. రి. లోని పౌరులకు వార్ధక్యమందు, అనారోగ్యముగా నున్నప్పుడు పాటుపడుశక్తిని గోల్పోయి నప్పుడు ఆర్థిక సంరక్షణకు హక్కుగలదు.

ప్రభుత్వఖర్చుపై కార్మికులయొక్క, ఉద్యోగస్థుల యొక్క సాంఘికజీవిత భీమాపద్ధతి యెక్కువగా యభివృద్ధి చేయుటవలనను, ఉచితవైద్య సహాయముచేతను, కష్టజీవుల ఉపయోగార్థము దేశమందన్ని ప్రాంతములందు ఆరోగ్యాశ్రమముల నిర్మించుటచేతను ఈ హక్కును సంరక్షించిరి.

121. సం. సో. సో. రి పౌరులకు విద్యనభ్యసించు హక్కుగలదు.

సార్వజనీన నిర్బంధోచిత ప్రాథమికవిద్య, ఉన్నతవిద్య, ప్రభుత్వవిరాళముల పద్ధతిపై విద్యార్థులందు అధికసంఖ్యాకులను పాఠశాలలయందు చదివించుటచేతను, మాతృభాష యందు బోధించుటచేతను. కర్మాగారము లందు ప్రభుత్వ భారములందు యంత్రాలయములందు మరనాగళ్ళ స్టేషనుల యందు సమిష్టిఫారములందు ఉచితపారిశ్రామిక, యంత్ర విజ్ఞానిక, వ్యవసాయికవిద్యను కష్టజీవులగుట చేతను, కొరకు ఈహక్కు కాపాడబడుచున్నది.

122. సం. సో. సో. రి. నందలి స్త్రీలకు ఆర్థిక ప్రభుత్వ వైజ్ఞానిక సాంఘిక రాజకీయ జీవితగోళములందు పురుషులతో పాటు సమానహక్కులు కలిగియున్నారు.

స్త్రీలకుకూడ పురుషులతో పాటు పాటుపడుహక్కు, ఆపనికితగిన జీతము, విశ్రాంతి, సాంఘికభీమా, విద్య, బాలిం

తలను, శిశువులను ప్రభుత్వము రక్షించుట గర్భిణులకు ఉచిత వేతనము, ప్రసూతి వైద్యశాలలు, శిశుసంరక్షణశాలలు, బాల బాలికల విద్యాలయములు మొదలగునవి స్థాపించుటవలన ఈహక్కు సాధింప సాధ్యపడినది.

123. సం. సో. సో. రి. నందలి పౌరులకు జాతిగాని తెగగాని విచక్షణలేకుండా ఆర్థిక, ప్రభుత్వవైజ్ఞానిక, సాంఘిక రాజకీయ, జీవితగోళములందు సమానహక్కులు గలవు. అది అనుల్లంఘనీయమైన న్యాయసూత్రము.

ఈహక్కులను ప్రత్యక్షముగానైనను అప్రత్యక్షముగా నైనను, నిర్బంధముచేసిన, లేక ఒక తెగకుగాని, జాతికిగాని సంబంధించినట్టి పౌరులకు ప్రత్యేకమైన అసామాన్యాధికారము స్థాపింపబడినను జాతీయమైనట్టిగాని, తెగకు సంబంధించినట్టిగాని ప్రత్యేకత్వము లేక ద్వేషమును శత్రుత్వమును వ్యాపింపజేసినను వారు న్యాయశాస్త్రములచే శిక్షార్హులు.

124. పౌరులకు ఆత్మస్వాతంత్ర్యముండుటకై సం.సో. సో. రి. నందు మతమును ప్రభుత్వమునుండి, పాఠశాలలనుండి, దేవాలయములనుండి వేరుచేయబడినది.

మతకర్మలను జేసికొనుటకు స్వతంత్రము, మతవిరుద్ధ ప్రచారమునకు స్వతంత్రము అందరకు గలదని గుర్తింపబడినది.

125. కష్టజీవుల ప్రయోజనముల ననుసరించి, సోష లిస్టు విధానమును బలపరచుటకై సం సో. సో. రి. పౌరులకు,

నమును బలపరచును. సోషలిస్టు విధానమును ప్రవర్ధమానము జేయు సేనాముఖము యిది. పబ్లికు ప్రభుత్వ సంబంధమైన అన్ని కష్టజీవుల సంస్థలందు ప్రధాన జీవకణామై ఈ పక్షముండును.

127. సం. సో. సో. రి. నందలి పౌరుల వ్యక్తిని అంటకూడదు. వారి వ్యక్తి పవిత్రమైనది. ఎవరినికూడ ఆరెస్టు చేయకూడదు. అటుల జేయవలసి వచ్చిన, ఒక న్యాయస్థానము యొక్కగాని, లేక ప్రాసిక్యూటరు యొక్కగాని అనుమతిపైనను మాత్రమే జేయవలెను.

128. పౌరుల గృహము లతిపవిత్రము లైనవి. వారి యుత్తర ప్రత్యుత్తరముల రహస్యమును న్యాయ చట్టముచే రక్షింపబడును.

129. కష్టజీవుల హక్కులకొరకు పోరాడుటవలన, శాస్త్ర పరిశోధనలను జేయుటవలన, జాతీయ దాస్యశృంఖలా విముక్తికి పోరాడుటవలన నిరంతర హింసకు లోనైన విదేశ నాయకులకు ఆశ్రయము రషియా యిచ్చును.

130. సం. సో. సో. రి. యొక్క ప్రతి పౌరుడు, విధిగా సంయుక్త సోవియటు సోషలిస్టు రిపబ్లికుల రాజ్యాంగ విధానమును అనుసరించవలెను. చట్టబద్ధులై యుండవలెను. కార్మిక నియమములకులోబడి యుండవలెను. సాంఘిక విధులను నిర్వహించవలెను. సోషలిస్టు సంఘముయొక్క సూత్రములను వాస్తవముగా గౌరవింపవలెను.

131. సం. సో. సో. రి. నందలి ప్రతి పౌరుడు సోవి యట్లు విధానమునకు పవిత్రమైనట్టి అనుల్లంఘనీయమైనట్టి యాధారముగనుకను, సంపత్తుకు, శక్తికి మాతృదేశమునకు మూలముగనుకను, కష్టజీవులకు యభివృద్ధికరమైన వైజ్ఞానిక జీవితమునకు మూలాధారముగనుకను, సోషలిస్టుపద్ధతి విధిగా రక్షించి బలపరచవలెను. దీనికి వ్యతిరేకముగా ప్రవర్తించు వారు ప్రజాద్రోహులు.

132. సార్వజనీనసైనిక సేవచట్టసమ్మతము, కార్మికుల కర్షకుల రక్తవర్ణరంజిత సైన్యమందు సైనికసేవ సం సో సో.రి. నందలి పౌరులకు గౌరవనీయమైనది, అది వారివిధి.

133. సం. సో. సో. రి. నందలి ప్రతిపౌరునకుమాతృ, దేశరక్షణ మవశ్య కర్తవ్యము. మాతృదేశద్రోహము, శపథ భంగము, శతృపక్షమునకు పారిపోవుట ప్రభుత్వసైనికశక్తికి హానిజేయుట, విదేశప్రభుత్వమునకు వేగునడుపుట, ఇవి యతి ఘోరమైన నేరములు గనుక చట్టసమ్మతమైన సంపూర్ణశిక్ష విధింపబడును.

# అధ్యాయము 11.

## నియోజన విధానము.

134. కష్టజీవుల ప్రతినిధులుగల సోవియట్లకు సం.సో. సో. రి. యొక్క కేంద్రశాసనసభకు, సమితిరిపబ్లికు నందలి శాసనసభకు, భూభాగము, రాష్ట్రము, పరగణా, జిల్లా, నగ

రము, పల్లెలందలి కష్టజీవుల ప్రతినిధులుగల సోవియట్లకు, స్వపరిపాలిత రిపబ్లికు శాసనసభకు, సార్వజనీన నియోజన ప్రత్యక్ష నియోజనములో రహస్య ఓటింగు పద్ధతిపై ప్రతినిధులను పేరులెన్నుకొందురు.

135. ప్రతినిధుల ఎన్నిక సార్వజనీనము; సం. సో. సో. రి. నందలి 18 వత్సరములు నిండిన యందరి పేరులకు, ప్రతినిధుల ఎన్నికలందు పాల్గొనుట, అభ్యర్థులుగా నిలబడుటకు హక్కుగలదు. పిచ్చివారు, కోర్టుచే ఓటింగులఅధికారము గోల్పోయినట్టివారు ఎన్నికలందు పాల్గొన వీలులేదు.

136. ప్రతినిధుల ఎన్నిక హక్కులు సమానమైనవి. జాతి, మతము, తెగ, విద్యావిషయిక యోగ్యతలు, పుటుక, ఆస్థి సంబంధమైన హోదా, పూర్వచరిత్ర, మొదలగువానితో, నెట్టి సంబంధములేకుండ ఎన్నుకొనుటకు ఎన్నుకొనబడుటకు హక్కుగలదు.

137. పురుషులతో సమానముగ స్త్రీలకుకూడా నియోజనాధికారము గలదు.

138. తదితర పౌరులతోపాటు, రక్తవర్ణ రంజిత సైన్యమందు సేవజేయు సైనికులకుకూడా ఎన్నుకొనుటకు, ఎన్నుకొనబడుటకు హక్కుగలదు.

139. ప్రతినిధుల ఎన్నిక ప్రత్యక్షనియోజకము; గ్రామ నగర సోవియట్లనుండి, సం. సో. సో. రి. యొక్క కేంద్ర

శాసనసభ వరకున్న అన్ని సోవియట్లకు ప్రతినిధులను పౌరులు ప్రత్యక్షనియోజనముచే ఎన్నుకొందురు.

140. ప్రతినిధుల ఎన్నిక రహస్యముగా జరుగును.

141. ఫిర్కా-వారిగా అభ్యర్థులు నియమింపబడుదురు.

కష్టజీవుల సంఘములకు, సాంఘికవ్యవస్థలకు అభ్యర్థులకును నియమించు హక్కు గలదు. కమ్యూనిష్టుపక్షము, వ్యాపారసంస్థలు, సహకార సంఘములు, యువకసంఘములు వైజ్ఞానికసంఘముల కీహక్కుగలదు.

142. ప్రతి ప్రతినిధి విధిగా వాని నియోజకవర్గమునకు వాని సేవను గురించి సోవియట్ల కృషిని గురించి నివేదించుకొనవలెను. వాడు వారికి బాధ్యుడై యుండును. వాని నియోజకవర్గమం దధికసంఖ్యాకులు విశ్వాసరాహిత్యము గనుపరచిన యెడల అతడు వెనుదిరిగి రావలెను.

# అధ్యాయము 12.

## చిహ్నము, పతాకము, ముఖ్యపట్టణము.

143. సమితిప్రభుత్వ చిహ్నము, ఒకసుత్తి, కొడవలి, వానివెనుక ఒక గోళముండును. దానిపై సూర్యకిరణములు పడునట్లుగా నుండును. దానిని ధాన్యపుకంకులు పరివేష్టించి యుండును. దానిపై "ప్రపంచ కార్మికులారా! ఏకముగండు"

అను వాక్యము రిపబ్లికుభాషలో చిత్రింపబడియుండును. ఈ చిహ్నము పైగా ఒక పంచకోణ నక్షత్రము గలదు.

144. కఱ్ఱసమీపముగా, పైమూలగా, ఎఱ్ఱగుడ్డపై కొడవలి, సుత్తి యొకదానిపై యొకటి యుండునట్లు మార్చి, వానిపై ఎఱ్ఱని పంచకోణ నక్షత్రము దాని యంచులు బంగారువర్ణ రంజితముగా నుండును. ఇది సోవియటు సోషలిష్టు రిపబ్లికుల సమితియొక్క పతాకము. దాని వెడల్పునకు పొడవునకు 1: $2\frac{1}{2}$ అను నిష్పత్తి యుండును.

145. సం. సో. సో. రి. యొక్క ముఖ్యపట్టణము మాస్కో

# అధ్యాయము 13.

## రాజ్యాంగ విధానమును సవరణజేయు పద్ధతి

146. కేంద్రశాసన సభయందలి రెండు సభలందు $\frac{2}{3}$ కన్నామించిన సభ్యులచే నామోదింపబడిన యెడల మాత్రమే, సం. సో. సో. రి. యొక్క రాజ్యాంగ విధానమును సవరణ జేయవచ్చును.



జోసఫ్ స్టాలిని యొక్క
చరిత్రాత్మక యుపన్యాసము.

# చారిత్రాత్మకోపన్యాసము

## అధ్యాయము 1.

### I రాజ్యాంగ విధాన విచారణ సంఘము-దాని విధులు

'మిత్రులారా! సం. సో. సో. రి. యొక్క సప్తమ సోవియటు కాంగ్రెసుయొక్క ప్రత్యేక తీర్మానానుసారము రాజ్యాంగ చట్ట విచారణ సంఘము ఏర్పాటు జేయబడినది. ఈ తీర్మానము 6వ ఫిబ్రవరి, 1935న ఆమోదింప బడినది. అది ఈ క్రింది విధముగానున్నది:—

"1. సం. సో. సో. రి. యొక్క రాజ్యాంగ విధానము నీ క్రిందివాని ననుసరించి సవరణ జేయవలెను.

(a) అప్రత్యక్షపు నియోజకముస్థానే సమాన ఎన్నికలును, బహిరంగ ఎన్నికలబదులు రహస్య ఎన్నికలను జేర్చి, ఎన్నికల విధానమును ఎక్కువగా ప్రజాయత్తము జేయుట.

(b) సం. సో. సో. రి. నందలి వర్గశక్తుల ప్రస్తుత సంబంధముల ననుసరించి చట్టమును నిర్మించుట ద్వారా చట్ట

మునయొక్క యార్థిక సాంఘికాధారములను గురించి స్పష్టముగా నిర్వచించుట: (నూతన సోషలిష్టు పరిశ్రమలను నెలకొల్పుట, భూస్వాములను నిర్మూలించుట, సమిష్టి వ్యవసాయ విధానమును స్థాపించుట, సోవియటు సంఘముయొక్క పునాదిగా సాంఘిక స్వామ్యమును అభివృద్ధిజేయుట, మొదలైనవి)

2. కేంద్రకార్య నిర్వాహక వర్గమును ఒక చట్ట విచారణ సంఘమును నియమింప మొదటిపేరాలో నిరూపించిన విధము ననుసరించి, చట్టములు వరుచుటకు, సం. సో. సో. రి. యొక్క కేంద్రకార్య నిర్వాహక వర్గపు అంగీకారమునకు ప్రవేశ పెట్టవలెను.

3. నూతన నియోజన విధానము ననుసరించి, సం. సో. సో. రి. లోని సోవియటు ప్రభుత్వ శాఖాలను ఎన్నికలను సక్రమముగా నిర్వహింపవలెను.

# 31. సభ్యులు

6వ ఫిబ్రవరీ 1935వ తేదీన ఈ నిర్ణయమునకు వచ్చిరి. మఱుసటిదినము అనగా 7వ ఫిబ్రవరి 1935న సం. సో. సో. రి. యొక్క కేంద్రకార్య నిర్వాహక వర్గముయొక్క ప్రథమ సమావేశము జరిగినది. సోవియట్ల సప్తమ కాంగ్రెసుయొక్క తీర్మానము ననుసరించి 31 సభ్యులుగల చట్టవిచారణ సం

ఘము నొక దానినేర్పాటు జేసిరి. చట్టవిచారణ సంఘమునకు, సం. సో. సో. రి. యొక్క రాజ్యాంగ విధానమును సవరణ జేయు చిత్తు చట్టమును తయారుజేయు బాధ్యతను, కేంద్ర కార్య నిర్వాహకవర్గము అప్పగించినది.

"ఈ కారణములచేత, సం. సో. సో. రి. యొక్క అత్యున్నత వ్యవస్థయిట్టియనుజ్ఞలనిచ్చి చట్టవిచారణ సంఘము నేర్పాటు జేసెను. ఈ యధికారములతో వారు తమ కార్యమునభివృద్ధి జేయవలెను.

1924వ సంవత్సరమందు ప్రవేశపెట్టబడిన రాజ్యాంగ విధానమందు, చట్టవిచారణ సంఘము కొన్ని సవరణలను జేయవలెను. సోషలిజము మూలముగ, సం. సో. సో. రి. యొక్క జీవితములో 1924 సం॥. తరువాత కలిగినమార్పుల కనుగుణ్యముగా ఈ సవరణలను జేయవలెను.

## II 1924వకు 1936వకును మధ్యేకాలమందు సం. సొ. సొ. రి. జరిగినమార్పులు.

1924_36 మధ్యేకాలమందు సం. సో. సో. రి. జీవితమందు జరిగినమార్పు లేవి? చట్టవిచారణ సంఘముయొక్క చిత్తుచట్టమందెట్టి మార్పులు ప్రతి ఫలింపవలెను?

ఈ మార్పులయొక్క సారమేమి ? మనము 1924 వందెట్టిస్థితియందుంటిమి?

సోషలిజమును పూర్తిగా అభివృద్ధిజేయుచు నూతనార్థిక విధానమందలి ప్రథమ పంచవత్సరకాలమందు, కాపిటాలిజమును కొంతవరకు తీసుకొనివచ్చుటకు అనుమతించిరి. అప్పుడు ఈరెండు ఆర్థికవిధానముల (కాపిటాలిజము, సోషలిజము) పోటీయందు సోషలిజము ప్రాబల్యమునకు తగిన కట్టుదిట్టములు జేయగలమను విశ్వాసముగలిగియుండిరి. ఈ పోటీకాలమందు, సోషలిజమును బలపరచుచు, కాపిటలిష్టు యంశములను రూపుమాపుచు, జాతీయ ఆర్థికవిధానమునందు మూలాధారముగానుండు సోషలిస్టు విధానముయొక్క విజయముకొరకు పాటుబడవలెను.

## పరిశ్రముల దురవస్త.

అప్పుడు మనపరిశ్రమ ముఖ్యముగా లోహపరిశ్రమ దుస్థితియందున్నది. అది క్రమముగా యథాస్థితికి తేబడుచున్నమాట వాస్తవము. కాని యుద్ధమునకు పూర్వముగల స్థితికింకను కడుంగడు దూరమునందున్నది. అది వెనుకబడిన ప్రాచీనుల యల్పశాస్త్రపద్ధతులమీాద యాధారపడియుండెను అది సత్యము, అప్పుడు పరిశ్రమయందు సోషలిస్టుభాగము నూటికి 80 పాళ్ళుగా నున్నది, అయితే కాపిటాలిజముయొక్క భాగము నూటికి 20 పాళ్ళుగా నున్నది.

మన వ్యవసాయమంతకన్నను ఎక్కువ విచారమైన యవస్థయందుండెను. భూస్వామి వర్గమును తొలగించిన

మాట వాస్తవము. అయితే ఆప్పటికి ధనికవ్యవసాయదారులు (కులక్కులు) అధికసంఖ్యాకులుగా నుండిరి. అప్పటి వ్యవసాయమంతయు ప్రాచీన యల్పశాస్త్రజ్ఞానముపై యాధారపడి, స్వల్పమై, వ్యక్తిపరమైన రైతుయార్థిక విధానములతో కూడి విశాల సముద్రమువలెనున్నది. ఈ మహాసముద్రమందు, ప్రత్యేకింపబడిన చిన్న లంకలవలె సమిష్టి ఫారములు, ప్రభుత్వ ఫారములు గలవు. వానికి జాతీయార్థిక విధానమందు ప్రాముఖ్యమేమీ లేదు. సమిష్టి ఫారములు, ప్రభుత్వ ఫారములు చాలా హీనదశయందున్నవి. అప్పుడు కులక్కు లెక్కువశక్తి వంతులుగా నుండిరి. మనమప్పుడు కులక్కుల నిర్మూలనము గురించిగాక, వారిప్రాబల్యమును తగ్గింప ప్రయత్నించితిమి.

దేశమందలి వస్తుప్రచారమును గురించి అదేవిధముగా చెప్పవచ్చును. వస్తుప్రచారమందు సోషలిష్టు భాగము నూటికి 50 నుండి 60 భాగములకన్న మించియుండలేదు. మిగతా భాగమంతయు వర్తకులు, వ్యాపారసహాసికులు, స్వంత వ్యాపారస్తుల యధీనమందున్నది.

## 1936 లో

1924 లో మన యార్థిక విధానముయొక్కస్థితి అటుల నున్నది ఇప్పుడు 1936 లో ఏపరిస్థితి యందున్నాము ?

అప్పుడు నూతన ఆర్థికవిధాన మందలి ప్రథమ దశ యందుంటిమి. కాపిటాలిజము కొంతవరకు తలయెత్తటానికి

అవకాశమివ్వవలసి వచ్చింది. కాని నేడు నూతనయార్థిక విధానమందలి తుదియంతరమునం దుంటిమి. జాతీయార్థిక విధానమందలి అన్ని శాఖలందున్న కాపిటాలిజము సంపూర్ణముగా నిర్మూలించ బడినది.

మన పరిశ్రమ, ఈకాలమందు, ఒక మహాశక్తిగా పరిణమించినది. ఇప్పుడు అది దుర్బలమైన దని గాని హీన పరికరములు గలదని గాని చెప్పుట కేమాత్రము వీలు లేదు. అంతేకాక, అది నూతనమైన, సంపన్నమైన నవీనయంత్ర జ్ఞానముపై నాధారపడి యున్నది. దానితోపాటు బలిష్టమై అభివృద్ధిజెందిన లోహపరిశ్రమ, దానిని మించి యభివృద్ధి జెందిన యింజనీరింగు పరిశ్రమకూడా గలవు. మన పరిశ్రమల నుండి కాపిటాలిజమును పూర్తిగా వెళ్ళగొట్టి, దానిస్థానే సోషలిష్టు యుత్పత్తి విధానము ప్రతిష్ఠింప బడినది. అది సర్వాధికారము చెలాయించు చున్నది. మన సోషలిష్టు పరిశ్రమను స్వల్పవిషయముగా దలచుటయ సాధ్యమైనది. ఏలననగా యుద్ధమునకు పూర్వకాలమందున్న యుత్పత్తి పరిమాణమునకు నేటిది 7 రెట్లు అధికముగా గలదు.

## ప్రభుత్వ ఫారములు

వ్యవసాయమందు కులాకుల ప్రాబల్యమునకు లోబడి షటువంటెన్ని స్వల్పమును, వ్యక్తిపరమును లోప భూయిష్ఠమును అగు శాస్త్రపద్ధతులతో సాగుచేయబడేటటు

వంటిన్ని వ్యవసాయభూములకు బదులు రైతులకుబదులు నవీనశాస్త్రపరిశోధనలతోకూడి ప్రపంచమందు అత్యధిక యంత్రసహిత వుత్పత్తివిధానము గలిగిన సమిష్టి, ప్రభుత్వ ఫారములంతటను వ్యాపించినవి. కులకువర్గము వ్యవసాయము నుండి తొలగింప బడినది. ప్రాచీనకాలపు పద్ధతులపై యాధారపడి, స్వల్పమును, వ్యక్తిగతమును అగు రైతు పొలముల భాగము అత్యల్పమైనది. అట్లు సేద్యముచేయబడిన భూవైశాల్యమును పోల్చిచూచిన నూటికి రెండు లేక 3 భాగములను మించియుండదు. ఈయంశము లందరికి తెలిసిన విషయములే. సమిష్టిపొలములకు 5, 700 000 అశ్వశక్తిగల 316,000 మరనాగళ్ళు గలవను విషయమును చెప్పక తప్పదు. మఱియు, ప్రభుత్వపొలములతోకూడా కలిపిన, వాటికన్నింటికి 7, 500, 000 అశ్వశక్తిగల 400, 000 మరనాగళ్ళు గలవు.

వస్తుప్రచార విషయమునకూడ, వర్తకులు, వ్యాపార సహసికులు, దీనినుండి త్రోసివేయబడిరి. వస్తుప్రచార మంతయు సంపూర్ణముగా ప్రభుత్వము సహకార సంఘములు, సమిష్టి ఫారముల హస్తగతమైనది. వ్యాపార సహసికులులేని, కాపిటలిష్టులులేని, వర్తకము, ఒక నవ్య సోవియటు వర్తకముత్పన్నమై యభివృద్ధి జెందుచున్నది.

## సంపూర్ణ విజయము

ఈ విధముగా, జాతీయార్థిక విధానమందలి యన్ని శాఖలందు సోషలిష్టు విధానమునకు, వాస్తవముగా, సంపూర్ణ జయము గలిగినది.

దీని యర్థమేమి ?

దీని భావమేమనగా, ఒక మానవుడు తోడిమానవుని దోచుకొనుట తొలంగింప బడినది. నిర్మూలింప బడినది. సోవియటు సంఘమునకు అతిక్రమించుటకు వీలులేని ఆధారముగా ఉత్పత్తి సాధనములపై సోషలిష్టు ఆధిపత్యము స్థాపింప బడినది. (ఎక్కువ కాలము హర్షధ్వనులు.)

సం. సో. సో. రి. యొక్క జాతీయయార్థిక గోళమందీ మార్పుల ఫలితముగా, విషమావస్థ, నిరుద్యోగ మెరుగని, దారిద్ర్యము నాశనము లేని, పౌరులందరికి సౌఖ్యవంతమై విజ్ఞానకరమైన జీవనమునకు ప్రతిఅవకాశము గలుగజేసెడి నూతన సోషలిష్టు ఆర్థికవిధానమిప్పుడు ఆచరణ యందున్నది.

1924నుండి—36వరకునున్న కాలమందు, ఆర్థిక ప్రపంచములో జరిగిన మార్పుల ననుసరించి, మన సంఘముయొక్క స్వరూపముకూడా మారినది.

అంతః కలహము విజయముతో సమాప్తమగుట జేసి, భూస్వామి వర్గమదివరకే నిర్మూలింప బడినది.

తక్కిన దోపిడిగాండ్ర వర్గముల విషయమున వారికి భూస్వామి వర్గమునకు పట్టినగతియే పట్టెను. పరిశ్రమ మండలమునుండి ధనికవర్గము నిశ్శేషమయ్యెను. వ్యవసాయిక మండలమందు కులక్కులంతరించిరి. వర్తకులు, వ్యాపార సహసికులు, వస్తుప్రచారమందు, యిప్పుడు లేరు. ఈ విధముగా దోపిడీ జేయు వర్గములన్నియు నిర్మూలింపబడెను.

కార్మికుల వర్గము మాత్రమే మిగిలినది. కర్షకుల తరగతి మాత్రమే నిలిచియున్నది.

వైజ్ఞానికులుకూడా మిగిలియున్నారు. కాని ఈ పరిణామ కాలమందు, ఈ సాంఘిక వర్గములందెట్టి మార్పు లేకుండా, కాపిటాలిజమ్ఉన్న కాలమందెటులయుండెడిదో ఆ విధముగనే యుండిరని భావించుట పొరబాటు.

# అధ్యాయము 2

## నేటి కార్మిక వర్గము

### నూతన కర్షకులు

ఉదహారణగా సం. సో. సో. రి. నందలి కార్మికవర్గమును తీసికొనుడు. తరుచుగా సంప్రదాయము ననుసరించి వారిని కార్మికవర్గమని (Proletariat) యే పిలచెదరు. అయితే కార్మికవర్గమననేమి? ఒక యార్థిక విధానమందు,

యుత్పత్తి సాధనములను తొలగింపబడిన పోగొట్టుకొనిన వర్గమునకు జెందినవారు పారిశ్రామికులు, అప్పుడుత్పత్తి సాధనములు ధనికవర్గముయొక్క స్వాధీనమందుండును. అప్పుడు ధనికవర్గమువారు కార్మికవర్గమును దోచుకొందురు. కాపిటలిష్టులచే దోచుకొనబడెడివారు కార్మికవర్గమునకు జెందినవారు. కాని మనదేశమందు మాకు తెలిసినట్లుగా, కాపిటలిష్టు వర్గమును త్రోసివైచి, కాపిటలిష్టుల యధీనమందున్న యుత్పత్తి సాధనములను స్వాధీనముజేసికొని కార్మికవర్గశక్తి ప్రధానముగా గలిగిన రాజ్యాంగ యంత్ర(స్టేటు) పరము చేయబడెను. (ప్రభుత్వపరము జేయబడెను. ప్రభుత్వముయొక్క శక్తి కార్మికవర్గము.) కాబట్టి కార్మికవర్గమును దోచుకొనుటకు ధనికవర్గమనునది లేదు. కనుక మన కార్మికవర్గమువారి యుత్పత్తి సాధనములను గోల్పోవకుండా, తదితర ప్రజలతో పాటు, వానిని తమ స్వాధీనమందుంచుకొనిరి. వానినియధీనమందుంచుకొన్నప్పుడు, కాపిటలిష్టు వర్గమును పారద్రోలినప్పుడు, కార్మికవర్గమును దోచుకొను వీలు తొలగింపబడినది.

## మార్క్సు చెప్పినది

ఇట్టిమార్పు జరిగినతరువాత పాతకప్రజను కార్మికవర్గ మనవచ్చునా? ... అనకూడదు. "కార్మికవర్గము దాస్యవిమోచనము జెందుటకు, కాపిటలిష్టువర్గమునునాశనము చేసి, వారినుండి యుత్పత్తిసాధనములను తీసికొని, కార్మికవర్గమేర్పడుటకు కారణమైన పరిస్థితులను నిర్మూలనము జేయ

వలెను.'' అని మార్క్సు చెప్పెను. దాని దాస్యశృంఖలా విముక్తికై ఈపరిస్థితులను, సం. సో. సో. రి. యందలి కార్మిక వర్గము పొందినదని చెప్పవచ్చునా? నిస్సందేహముగా అటుల జరిగినదని చెప్పక తప్పదు. అయితే దీని యర్థమేమి? దీని యర్థ మేమనగా, సం. సో. సో. రి. యందలి కార్మికవర్గము, సంపూర్ణమైన నూతనవర్గముగా పరిణమించినది. కాపిటలిష్టు ఆర్థికవిధానమును నాశనము జేసి, యుత్పత్తిసాధనములను సంఘపరము జేసి, సోవియటుసంఘమును కమ్యూనిజమనెడి గమ్యస్థానమునకు కార్మికవర్గము నడుపుచున్నది.

సం. సో. సో. రి. నందలి కార్మికవర్గము పూర్తిగా నూతనవర్గము, దోపిడినుండి విముక్తి బడసినది. నేటివరకు మానవచరిత్రయందు దీనికిసమానమైనది ఎచ్చటను గానరాదు.

## కర్షక వర్గము

కర్షకవర్గమును గురించి విచారించుదము. కర్షకవర్గము స్వల్పయుత్పత్తిదారుల వర్గమని చెప్పుట యలవాటు. దాని యందలి వ్యక్తులు, దరిద్రులై వివిధప్రదేశములందు చీలిపోయి ఏవ్యక్తి కావ్యక్తి ప్రాచీనపద్ధతులతో తమ కొద్దిపొలములను దున్నుకొనుచు, స్వంతయాస్తికి బానిసలై, భూస్వాములు, వర్తకులు, కులక్కులు, వ్యాపారసహాసికులు, వడ్డీవ్యాపారస్థులు మొదలగువారు తమ్ము దోచుకొనుటను ఈషణ్మాత్రమైన కష్టములేకుండా సహించెడివారు. ధనికదేశములందున్న కర్షక

వర్గమును ఒక్కసారి మనస్సులో వుంచుకొని చూస్తే, అం దధికభాగము నిశ్చయముగా నట్టివారే. కాని మన సమకాలిక మైన కర్షకవర్గము అనగా సోవియటు కర్షకవర్గము, పూర్తిగా ధనికదేశ కర్షకవర్గమును పోలియున్నదని చెప్పసాధ్యమగునా? అటుల చెప్పుట కెంతమాత్రము వీలులేదు. మన దేశ మందిట్టి కర్షకవర్గము లేదు. మన సోవియటు కర్షకవర్గము ఒకనూతన వర్గము. కర్షకులను దోచుకొనెడి భూస్వాములు, కులక్కులు, వర్తకులు, వడ్డీవ్యాపారస్తులు, మన దేశమందు లేరు. దోపిడి నుండి విమోచనము జెందినది మన రైతువర్గము. మన సోవియటు కర్షకవర్గమునం దత్యధిక సంఖ్యాకులు సమిష్టి ఫారముల కర్షకులు. అనగా వారు, వారి పనిని, ఆస్థిని ప్రాచీన పద్ధతుల పైనను, వ్యక్తిగత మైన పాటకశక్తి పైనను ఆధారపడునట్లు జేయక నవీన శాస్త్రపరిశోధనా ఫలితముల పైనను, సమిష్టి పాటకశక్తి పైనను ఆధార పరచిరి. ఆఖరున, మన కర్షకవర్గపు ఆర్థికముయొక్కపునాది స్వంతయాస్తి గాక, సమిష్టిస్వామ్యముగా నున్నది. అది సమిష్టిశక్తి పై యాధారపడి యభివృద్ధి జెందియున్నది.

సోవియటు కర్షక వర్గము సంపూర్ణమైన నూతన కర్షక వర్గము. ఇట్టిదానిని మానవజాతి చరిత్రయం దెప్పుడుకూడా చూచి యుండ లేదు.

## విద్యావంతులు

తుదకు, విద్యావంతులు, అనగా ఇంజనీరింగు, యంత్ర జ్ఞాన ప్రవీణులగు పనివాండ్ర విషయమున, వైజ్ఞానిక పార్శ్వమున పోరాడు పనివారు, ముఖ్యముగా నౌకరీ చేయువారి సమస్యను విచారించుదము. ఈ జరిగిన కాలమందు, వారు కూడా గొప్ప మార్పునకు లోనైరి. వర్గము లన్నింటిపైన జేరగోరు కఠిన మనస్సు గల పూర్వపు వైజ్ఞానికులు గారు వీరు; పూర్వము, నిజముగా, వారియందధిక సంఖ్యాకులు, భూస్వాములను, కాపిటలిస్టులను సేవించిరి. కాని సోవియటులోని విద్యావంతులు సంపూర్ణముగ నూతన విద్యావంతులు. వారియొక్క వేళ్ళన్నియు కార్మిక కర్షక వర్గముల మూలముతో నల్లుకొని యున్నవి. మొదట వైజ్ఞానిక వర్గముయొక్క నిర్మాణమంతయు మారినది. ప్రభుసంతతి బూర్జువా వర్గముయొక్క సంతానము, మన సోవియటు విద్యావంతులలో చాలా అల్పసంఖ్యాకులుగా నున్నారు. మన విజ్ఞానధనులలో నూటికి 40 నుండి 90 వరకు కార్మిక కర్షక వర్గములనుండి తదితర పాటక జనమునుండి యుత్పన్నమైరి. తుదకు వైజ్ఞానులు జేయు కార్యస్వరూపము కూడా మారినది. పూర్వము, ధనిక తరగతులను, గత్యంతము లేక వారు సేవింపవలసి యుండెను. ఇప్పుడు దోపిడిగాండ్ర వర్గములు లేనందున వారు ప్రజాసేవ చేయవలసి వచ్చెను. దీని మూలముగానే, వారు సోవియటు సంఘమందు సంపూర్ణ విశ్వాసము

గలసభ్యులైరి. వారు కార్మిక కర్షక వర్గములతో భుజముభుజము కలిపి, ఒక నూతనవర్గ రహిత సోషలిస్టు సంఘనిర్మాణ కార్యమందు బద్ధకంకణులైరి.

ఈ విశాల భూవలయమందే దేశమందును ఇట్టి పాటు బడెడి నవీన విజ్ఞానవర్గమును మీరు చూచి యుండరు.

సోవియటు సంఘ మందలి వర్గ నిర్మాణ మందు, మనము పరీక్షించు కాలమందు, యిట్టి మార్పులు జరిగినవి.

## మార్పుల ప్రాముఖ్యము

ఈ మార్పులు దేనిని సూచించు చున్నవి ?

మొదట, కార్మిక వర్గమునకు కర్షక వర్గమునకు మధ్యనున్న సరిహద్దు రేఖను, వారికిని విద్యావంతులకును మధ్య నున్న సరిహద్దు రేఖయు, తుడిచివేయ బడినవి. పూర్వపు వర్గభేదము అంతర్హిత మగుచున్నది. ఈ సాంఘిక సముదాయముల మధ్యనున్న దూరము రోజురోజుకు తగ్గి పోవుచున్నది. తరువాత సాంఘిక సముదాయముల మధ్య నున్న ఆర్థిక వైరుధ్యములు నాశనమై, అంతర్హిత మగు చున్నవి.

తుదకు, వారి మధ్యనున్న రాజకీయ వైషమ్యములు కూడా అంతరించి మటు మాయ మగుచున్నవి.

సం. సో. సో. రి. నందలి వర్గ నిర్మాణమందు జరిగిన మార్పు లీ విధముగా నున్నవి.

సం. సో. సో. రి. నందలి సాంఘిక జీవనమందు జరిగిన మార్పుల చిత్రము జరిగిన కొన్ని మార్పులను గురించి వివరింపక పోయిన యెడల, పూర్తి గాదు. సం. సో. సో. రి. లోని జాతుల పరస్పర సంబధముల విషయము నా దృక్పథమందున్నది. మన సోవియటు సమితి దాదాపు 60 జాతులు జాతీయ సముదాయము గలది. సోవియటు ప్రభుత్వము అనేక జాతుల ప్రభుత్వము. కనుక సం. సో. సో. రి. నందలి వివిధ జాతుల మధ్య నున్న సంబధమును గురించి మనకు చాలా ప్రధాన మైనది కాక తప్పదని మీకు స్పష్టమగుచున్నది.

## సమితి సూత్రములు

సం. సో. సో. రి. యొక్క సోవియట్ల ప్రథమ సమావేశ మిప్పుడు, 1922 లో, సోవియటు సోషలిష్టు రిపబ్లిక్కుల సమితి ఏర్పడినది. అదిఅందలిజాతులయొక్క సమత్వ స్వతంత్రేచ్ఛలపైన ఆధార పడియున్నది. ప్రస్తుత మమలులో నున్న రాజ్యాంగ విధానము 1924 లో ప్రవేశపెట్టబడినది. ఆ కాలమందు జాతుల మధ్యనున్న సంబంధములు సక్రమముగా పరిష్కరింపబడ లేదు. గ్రేటురష్యనులు(Great Russians)

పైనున్న యపనమ్మకము యొక్క శకలము లింకను యంతరించలేదు. మధ్యోద్గామి శక్తులు యింకను నిలిచి పని జేయుచున్నవి.

ఆ పరిస్థితులందు, ఆర్థిక, రాజకీయ, సైనిక సంబంధమగు పరస్పర సంబంధములపై ప్రజల సోదర సహకారమును స్థాపించుట యత్యవసరమైనది. వారి నందరిని బహుజాతీయ సమితి ప్రభుత్వమందైక్యము జేయవలసి వచ్చినది. ఆ కార్యమందున్న కష్టపరంపరలను సోవియటు ప్రభుత్వము గ్రహించకుండా యుండలేదు. బూర్జువా దేశములందలి అనేక జాతుల ప్రభుత్వములు నిష్ఫలములైన ప్రయోగములుగా నుండుట సోవియట్ ప్రభుత్వము చూచినది. ప్రాత ఆష్ట్రియా, హంగేరి సామ్రాజ్య పతనము మన కండ్లార గాంచితిమి. అయినప్పటికిని, సోవియటు ప్రభుత్వము, అనేక జాతుల ప్రభుత్వమేర్పాటుజేయ సంకల్పించుకొనెను. సోషలిజముపై యాధారపడియున్న బహుజాతీయ ప్రభుత్వము, అన్ని రకములైన, ప్రతి విధమైన పరీక్షనుండి వెలువడునని వారికి తెలియును.

అప్పటినుండి 14 సంవత్సరములు గడచినవి. ఈ ప్రయోగమును పరీక్షించుటకు ఈ వ్యవధిచాలును. అయితే, మనమేమి చూచుచున్నాము ? ఈ జరిగిపోయిన కాలము, సోషలిజమును పీఠముపై, బహుజాతీయ ప్రభుత్వమేర్పాటుజేయు ప్రయోగము, నిస్సందేహముగా నెగ్గినది. లెనినుయొక్క

జాతీయ విధానమునకు నిస్సంశయమైన, జయము (కరతాళ ధ్వనులు.)

## ఈ జయమెందులకు ?

ఈ జయమునకుగల కారణము లేమని చెప్పవచ్చును?

మతవైషమ్యములు, కులకక్షలను ప్రోత్సహించెడి దోపిడివర్గములు లేవు; జాతి విద్వేషముల నభివృద్ధిజేసి, పరస్పరము అపనమ్మకము పెంచెడి దోపిడిలేదు; ప్రభుత్వశక్తి యంతయు, ఫాసిసత్వమునకు శత్రువైనట్టియు, అంతర్జాతీయ సిద్ధాంతము నాదర్శముగా నుంచుకొనినట్టియు, కార్మికవర్గము యొక్క హస్తగతమైనది; ఆర్థిక, సాంఘిక జీవనమందున్న యన్నిమండలములందు ప్రజలు పరస్పర సహాయముజేసి కొనుట యనుభవసిద్ధమగుచున్నది. తరువాత సం. సో. సో. రి. యందలి వివిధజాతుల జాతీయవిజ్ఞానము వర్ధిల్లుచు, అది స్వరూపమందు జాతీయమును, భావములందు సోషలిష్టుగా నున్నది—ఇవియన్నియు, మఱి వీనినిపోలినట్టి యంశములును, సం. సో. సో. రి. నందలి ప్రజలయొక్క స్వభావమును పూర్తిగా మార్చినది; వారియందు పరస్పర స్నేహభావమభివృద్ధి జెందుచున్నది. ఈవిధముగా ఒక సమితిప్రభుత్వమందు జాతులమధ్య సత్యమైన సోదరసహకారము స్థాపింపబడినది.

దీని పర్యవసానముగా, అన్నిపరీక్షలందు నెగ్గినట్టియు, ప్రపంచమందేభాగమందున్న ఏజాతీయ ప్రభుత్వమైనను దీని నిశ్చలత్వమునుచూచి, అసూయజెందెడి, ఒక సంపూర్ణమైనబహు

జాతీయ ప్రభుత్వము మనకుగలదు. (కరతాళధ్వనులు చెల రేగును.)

సం. సో. సో. రి. లోని జాతీయ పరస్పర సంబంధము లందు గడిచిన కాలములో జరిగిన మార్పు లివి. 1924 నుండి 36 వరకు, సం. సో. సో. రి. లో ఆర్థిక సాంఘిక రాజకీయ జీవితము లందు జరిగిన మార్పుల మొత్తమిది.

# అధ్యాయము 3.

## క్రొత్త రాజ్యాంగ చట్టము యొక్క ముఖ్య లక్షణములు.
## ప్రజా స్వామికమునకు హద్దులు లేవు.

సం. సో. సో. రి. జీవన మందు జరిగిన ఈ మార్పు లన్నియు చిత్తు చట్టములో వేనియందు ప్రతి ఫలించినవి ?

ఈ కాంగ్రెసు యొక్క విచారణకు దాఖలు చేయ బడిన చిత్తు చట్టముయొక్క ముఖ్య లక్షణము లేవి ?

1924 సంవత్సరపు రాజ్యాంగ విధానము నందు మార్పులు జేయ చట్ట విచారణ సంఘము వా రాజ్ఞాపింపబడిరి. వారి నిరంతర కృషి ఫలితముగా ఒక నూతన రాజ్యాంగ విధానము వెలువడినది. అది సం. సో. సో. రి. యొక్క నూతన రాజ్యాంగ విధానము యొక్క చిత్తు. నూతన రాజ్యాంగ విధానమును రచించుచు చట్ట విచారణ సంఘమువారు,

రాజ్యాంగ విధానమును ప్రణాళికను పర్యాయి పదము లుగా భావింపకూడదను నభిప్రాయముతో నుండిరి. రాజ్యాంగ విధానమునకు ప్రణాళిక చాలా ముఖ్యమైన భేధము గలదని దీనియర్థము. అప్పటికింకను యమలులోనికి రానివి, భవితవ్యమందు వేనిని సాధింప వలసినది మొదలగు వానిని గురించి ప్రణాళిక చెప్పును. దీనికి వ్యతిరేకముగా, రాజ్యాంగ విధానము అప్పటి కున్న వానిని స్పష్టపరచి, ఇప్పటికి సాధిం చిన వానిని తెలియ జేయును. ప్రణాళిక భవితవ్యమునకు రాజ్యాంగ విధానము వర్తమాన కాలమునకుసంబంధించినవి.

రెండు ఉదాహరణలిచ్చి విశదపరచెదను.

మన సోవియటుసంఘము చాలభాగము సోషలిజమును స్థాపించుటయందు నెగ్గింది. సోషలిష్టువిధానమును సృష్టించుట యందు అనగా మార్క్సు సిద్ధాంతానుసారముగా, కమ్యూ నిజముయొక్క ప్రథమయంతరము అనిగాని లేక క్రింది సోపాన మనిగాని యనదగిన దానిని సంస్థాపనము జేయుట యందు కృతకృత్యురాలైంది. అనగా మనదేశమందు కమ్యూ నిజముయొక్క మొదటియంతరమైన సోషలిజము చాలా భాగమువరకు సాధింపబడినది. (కరతాళధ్వనులు). కమ్యూ నిజముయొక్క మొదటియంతరము నందలి మూలసూత్రము, "ప్రతివ్యక్తి వాని శక్తి వంచనలేకుండా పాటుపడవలెను. వానికి వానిపాటు ననుసరించి కూలి యివ్వబడును." సోషలిజమును బడయగలిగితి మను యంశమును రాజ్యాంగవిధానము ప్రతిఫ

లింప జేయవలెనా? ఆజయలక్ష్మిపై యది యాధారపడి యుండవలెనా? అది నిశ్చయముగా చూపించవలెను." సం.సో.సో.రి. కు సోషలిజ మనునది సాధించి జయించినది గనుక చట్టము దానిని కనుపర్చవలెను.

అయితే సోవియటుసంఘము, కమ్యూనిజముయొక్క పైసోపానమును యింకను జేరలేదు. ఆయంతరమందు ముఖ్యసూత్రము, "ప్రతివ్యక్తి వానిశక్తివంచనలేకుండా పాటుపడవలెను. వాడు వానియవసరములనుబట్టి సామగ్రిని గైకొనవచ్చును." భవితవ్యమందు కమ్యూనిజముయొక్క అత్యున్నత యంతరమును జేర యాశించినను, మనచట్టము యిప్పుడాచరణయందులేని, యింకను సాధింపబడని, యత్యున్నత యంతరమైన కమ్యూనిజముపై నాధారపడియుండవలెనా? కాదు. అదివీలులేదు. సం. సో. సో. రి. రిపబ్లికు కమ్యూనిజముయొక్క పైయంతరమును యింకను జేరలేదు. అది భవితవ్యమందు సాధ్యపడవలసినది. అది (చట్టము) కార్యక్రమ ప్రణాళికగాని లేక భవితవ్య సాధనాయాంశ ప్రకటన పత్రికగాని కాకుండా యుండవలెనని అటుల జేయ వీలులేదు.

## శాసన క్రోడీ కరణము.

ఈ చరిత్రాత్మక కాలమందు మన విధానమునకివి హద్దులుగా నున్నవి.

కాబట్టి ఈ నూతన రాజ్యాంగవిధానముయొక్క చిత్తు చట్టము మనమింతవరకు సాధింపగలిగిన యంశములను చూపించును. కనుక అది మనమింతవరకు సంపాదింపగలిగిన యంశముల "రికార్డు", శాసనక్రోడీకరణముగానున్నది. (కరతాళధ్వనులు).

తరువాత బూర్జువా దేశములందలి రాజ్యాంగవిధానములను, కాపిటలిస్టు విధానమతి పవిత్రమనియు, అనతిక్రమణీయమనెడి భావముతో ప్రారంభించెదరు. ఈవిధానములకు కాపిటాలిజముయొక్క ముఖ్యసూత్రములు, అందు మూలకదంబములైనవియు, ఆధారముగా నుండును; భూమి, అడవులు, కర్మాగారములు, పరిశ్రమాలయములు, మఱి యితర వుత్పత్తిసాధనములు స్వంతయాస్తిగా నుండుట, ఒక మానవుడు మఱొకమానవుని దోచికొనుట; దోపిడిగాండ్రు; దోచుకొనబడెడి కష్టజీవులుండుట, నిరాధారులైన యధికసంఖ్యాకులగు కష్టజీవులు, సంఘముయొక్క ఒక ధృవమువద్దను, రక్షణగలిగి సోమరులైన ధనికుల సంతోషము మరొక ధృవమువద్ద నుండుట; ఈవిధముగా నున్నది. ఈ మొదలైన కాపిటాలిజముయొక్క ముఖ్యసూత్రములపై అవి ఆధారపడియున్నవి. వాని నవి ప్రతిబింబించుచున్నవి. వానిని శాసనరూపముగా క్రోడీకరించుచున్నవి.

దీనికి వ్యతిరేకముగా సం. సో. సో. రి. యొక్క చిత్తుచట్టము కాపిటలిష్టువిధాన నిర్మూలనముపై యాధారపడి,

సోషలిష్టువిధానవిజయమునుండి బయలు దేరినది. సం.సో.సో.రి. యొక్క నూతనరాజ్యాంగవిధానము యొక్క చిత్తుచట్టమునందు సోషలిజసూత్రము లున్నవి. ఇంతవరకు సాధించిన వైనముఖ్య సిద్ధాంతములపై నాధారపడియున్నది; భూమి, అరణ్యములు, కర్మాగారములు, యంత్రాలయములు, తదితర యుత్పత్తి సాధనములు సంఘపరముగానున్నవి; దోపిడి, దోపిడిజేయు వర్గములు నిర్మూలింపబడినవి; అధిక సంఖ్యాకులకు దారిద్ర్యము, అల్పసంఖ్యాకుల కానందము తొలగింప బడినది; నిరుద్యోగము లేకుండా జేయబడినది; పని, పాటుబడుట ప్రతి యారోగ్య వంతునకు విధిగానున్నది; "పని జేయనిచో తిండిలేదు" అను సూత్రాను సారముగా, ప్రతివాడు పాటుబడుట విధిగాను గౌరవముగా నున్నది; పాటుబడు హక్కు, అనగా ప్రతి పౌరు నకు విధిగా నుద్యోగమిచ్చుట; విశ్రాంతి తీసికొను హక్కు; విద్యా వ్యాసంగమునకు హక్కు మొదలైనవియు గలవు. దీనిపైనను వీనిని పోలినట్టి సోషలిజ ముఖ్య సూత్రములపై నను ఈ నూతన రాజ్యాంగ విధానము యొక్క చిత్తు చట్ట మాధారపడీ యున్నది. వీని నది ప్రతిఫలించు చున్నది. దానికి న్యాయశాస్త్ర శక్తి నొసగుచున్నది.

ఇది నూతన రాజ్యాంగ విధానముయొక్క రెండవ ముఖ్య లక్షణము.

## శత్రువర్గములు లేవు.

తరువాత బూర్జువా రాజ్యాంగ విధానములు సంఘము శత్రువర్గములతో నిర్మింపబడిన దనియు, కొన్ని వర్గములు

సంపద కలిగిన వారనియు, కొన్ని లేనివారను యుద్దేశ్యముతో బయలు వెడలుదురు. ఏ పక్షము ప్రభుత్వాధికారము వహించినను, సంఘమునకు దారిచూపు నధికారము (నియంత్వత్వము) బూర్జువా యధీనమం దుండవలెను. సంపన్న వర్గములకు లాభకరమైన ఆనంద దాయకమైన సాంఘిక వ్యవస్థను దృఢీకరించుటకు చట్ట మగత్యము.

దీనికి వ్యతిరేకముగా సం. సో. సో. రి. యొక్క చిత్తు చట్టము సంఘమందు విరోధవర్గములు లేవనియు, సంఘమందు పరస్పర స్నేహాభిలాషులగు రెండేవర్గములు, అనగా కార్మికవర్గము, కర్షకవర్గము కలవనియు, కష్టజీవులలో ముందంజవేసిన కార్మికవర్గముయొక్క పరముగా ప్రభుత్వమున్నదనియు, కష్టజీవుల కనుకూలమైన లాభదాయకమైన సాంఘికవ్యవస్థను దృఢీకరించుటకు చట్టమవసరము అని భావించెను.

ఈ నూతనరాజ్యాంగ విధానమునందు ముఖ్యమైన మూడవ విశేషము.

తరువాత, బూర్జువారాజ్యాంగ విధానములు, ప్రభుత్వజాతులు అస్వతంత్ర జాతులు సమానహక్కులు గలిగియుండుటకు వీలులేదను సిద్ధాంతముపై బయలుదేరినవి. కొన్నిజాతులకు సంపూర్ణహక్కులుగలవు. కొన్నిజాతులకు సంపూర్ణహక్కులు లేకున్నవి. మూడవరకమునకుజేరిన వలసరాజ్యములు రెండవ రకమునకుజేరిన వానికన్నా తక్కువ హక్కులుకలవి. ఇట్టి

సిద్ధాంతముల పైన యాధారపడియున్నవి. ఈ రాజ్యాంగ చట్టము లన్నియు ముఖ్యముగా ప్రభుత్వాధికారము వహించిన జాతుల కొరకేర్పడినవని దీనియర్థము.

దీనికి ప్రతికూలముగా, సం. సో. సో. రి. యొక్క చిత్తు చట్టము, అంతర్జాతీయ భావ ప్రపూరితము. అన్ని జాతులకు తెగలకు సమాన హక్కులు గలవను సిద్ధాంత మును అనుసరించును, దేహవర్ణము నందుగాని. భాషయందు గాని, విజ్ఞాన అభివృద్ధి నందుగాని, ప్రభుత్వ పరిణామయం తరమందుగాని యున్న విభేధములు, లేక జాతులకు తెగల కెట్టి భేదము లున్నను అవి జాతీయ అసమానతకు హేతువు కాజాలదను యుద్దేశ్యముతో బయలు దేరెను. పూర్వ పరి స్థితులనుగాని ప్రస్తుత పరిస్థితులను గాని పాటింపక, వారి శక్తిసామర్థ్యములను గాని బల హీనతను గాని లక్ష్యము చేయక అన్ని జాతులు తెగలు, సంఘము యొక్క ఆర్థిక, రాజకీయ, సాంఘిక విజ్ఞాన జీవితము లన్నింటి యందు సమాన హక్కు లనుభవింప వలెననుటను అంగీకరించును.

## ప్రజా స్వామికము యొక్క ముఖ్య లక్షణములు

### ఇది నాల్గవ ముఖ్య లక్షణము,

ఈ రాజ్యాంగ విధానము యొక్క చిత్తు చట్టము యొక్క అయిదవ ముఖ్య లక్షణము అది ఎక రీతిగాను అవి చ్ఛిన్నముగాను సంపూర్ణమైన ప్రజా స్వామికము. ప్రజా

స్వామ్య దృక్పథమునుండి భూర్జువా రాజ్యాంగ విధానము లను రెండు రకములుగా విభజింప వచ్చును. ఒకరకపు విధానములు పౌరునకు సమాన హక్కులను, ప్రజా స్వామ్య సూత్రములను ప్రత్యక్షముగా నిరాకరించును. లేదా వానిని పూర్ణాను స్వారముగా జేయును. రెండవ రకము రాజ్యాంగ విధానము ప్రజా స్వామ్య సిద్ధాంతములను సుకరముగా అంగీకరించి, వాని ఆడంబరముతో ప్రదర్శించును. అయితే, ఆ విధముగా జేయునప్పుడు, సమాన హక్కులకు స్వతంత్ర మునకు కొన్ని కట్టుదిట్టములను,మినహాయింపులను జేయుదురు. కనుక ప్రజా స్వామ్య హక్కులను భిన్న భిన్నములుగా జేయ బడినవి. పౌరు లందరికి సమాన ఫ్రొటింగు హక్కు గలదని విధానములు ప్రకటించును. కాని సమాన హక్కు నివాసము విద్య, మఱియు ఆస్తి మొదలైన యర్హతలచే యరికట్టెదరు. పౌరులకు సమాన హక్కు గలవని చెప్పెదరు. కాని అప్పటి కప్పుడే, ఇది స్త్రీ లందరికి వర్తింప దని గాని లేక కొందరికే యని గాని మినహాయింపు జేసెదరు. ఈ విధముగా నున్నది.

సం. సో. సో. రి. యొక్క నూతన రాజ్యాంగ విధానముయొక్క చిత్తుచట్టముయొక్క ముఖ్యలక్షణము, యిట్టి మినహాయింపులు, హద్దులు లేకుండుటయే, కార్యశూరులగు పౌరులకు నిర్వ్యాపారులగు పౌరులకు వ్యత్యాసమిందుండదు. పౌరులందరు కార్యశూరులే, వారు నిస్తబ్ధులుగారు. పురుషులకు స్త్రీలకును, గృహస్థులకు బ్రహ్మచారులకు, ధనవంతులకు దరిద్రులకు, విద్యావంతులకు విద్యావిహీనులకుం మధ్య భేద

ముల నది గుర్తింపదు. పౌరులందరకు దానిక్రింద సమాన హక్కులుగలవు. ఆస్తిస్థితిగాని, జాతీయతగాని, స్త్రీ, పురుష భేదముగాని, ప్రభుత్వోద్యోగముగాని, సంఘమందొకని స్థానమును నిర్ణయించవు. సంఘమందొకని స్థానము వానివ్యక్తిగతమైన శక్తిపైనను, వానిపాటుపైనను, ఆధారపడి యుండును.

తరువాత ఈనూతనరాజ్యాంగవిధానమునకు మరొక విలక్షణము గలదు. బూర్జువా రాజ్యాంగ విధానములు పౌరులకు లాంఛనముగా హక్కులను నిర్ణయించుటతో సంతృప్తిజెందును. ఈహక్కుల నే పరిస్థితులందెటుల నిర్వహించవలెనోయను విషయమును వారు ఆలోచింపరు. అవి నెరవేర్చుట సాధ్యపడునా, పడదా యను యంశముగాని ఏరీతిగా సాధ్యమగునను విషయమునుగాని విచారించరు. వారు పౌరులందరు సమానులని యందురు. కాని యజమానులకు కార్మికులకును, భూస్వామికి కర్షకునకు మధ్య నిజముగా సమానత్వముండుటకు వీలులేదను యంశమును వారు మరచి పోయిరి. యజమానులకు భూస్వాములకు ధనమును, రాజకీయ హక్కులును ఉండును. కార్మిక కర్షకులకు ధనమును, రాజకీయ హక్కులును ఉండవు. మొదటివారు దోపిడీగాండ్రైన రెండవవారు దోచుకొనబడెడి వారగుదురు. తరువాత వారు వాక్స్వాతంత్ర్యము, సమావేశస్వాతంత్ర్యము ప్రచురణ స్వాతంత్ర్యమును గురించి మాట్లాడెదరు. కార్మికవర్గమునకు సమావేశములకు తగినస్థలమును, శ్రేష్టమైన ముద్రణా

లయములు, తగినంతకాగితము మొదలైనవి యుండుటకు వీలునుగురించి అయితే ఈ త్రివిధస్వాతంత్ర్యములు బూటకమైన మాటలగుననుటను వారు మరచిపోయిరి.

## హక్కులకు హామీ.

ఈ నూతన రాజ్యాంగ విధానమునకు మరొక ముఖ్య లక్షణముగలదు. అది పౌరులకు లాంఛనముగా హక్కులను నిర్ణయించుటయందు సంతృప్తి జెందలేదు. అయితే, ఈ హక్కులకు పూచీపడుటయందు, ఈ హక్కులను సాధించు విధమునందు, స్పష్టపరచెను. పౌరుల హక్కులందు సమానతను ప్రకటించుటచేగాక, దోపిడిరాజ్యమును తొలగించుటచేతను, అన్ని రకముల దోపిడినుండి పౌరులకు విమోచనముగలుగ జేయుటచేతను, సంపూర్ణ సమానత్వము సిద్ధింపజేసెను. ఇది శాసన రూపముగా వెలువడెను. ప్రతివానికి పాటుపడెడి హక్కును ప్రసాదించుటయేగాక, శాసనరూపముగా నిరుద్యోగ సమస్యనిర్మూలనము చేయుటచేతను, సోవియటు సంఘమందు విషమావస్థ లేకుండా జేయుటచేతను, ఇది సాధ్యపడినది. ప్రజాస్వామ్య స్వాతంత్ర్యములను ప్రకటించుటయేగాక, కొన్ని ప్రకృతి సిద్ధమైన పద్ధతులచే శాసనముగా నేర్పాటు జేసిరి. నూతన రాజ్యాంగ విధానముయొక్క చిత్తుచట్టమునందు పేర్కొనబడిన ప్రజాస్వామ్యము "సాధారణమైనది." "సామాన్యమైనది." గాక సోషలిష్టు ప్రజాస్వామ్యమని స్పష్టముగా తెలియుచున్నది.

సం. సో. సో. రి. యొక్క రాజ్యాంగ విధానము యొక్క చిత్తుచట్టమందలి ముఖ్యలక్షణములివి.

1924నుండి—36వరకున్న కాలమందు, సం. సో. సో. రి. జీవనమందలి, ఆర్థిక రాజకీయ సాంఘిక గోళములందు గలిగిన మార్పులను, అభివృద్ధిని ఈ విధముగా, నూతన రాజ్యాంగ విధానమందు ప్రతి ఫలించినవి.

# అధ్యాయము 4

## రాజ్యాంగ విధానమును వివరించుట

## ఫాసిష్టు విమర్శనకు సమాధానము

ఈ చట్టముయొక్క చిత్తుపై బూర్జువా జేసిన విమర్శనను గురించి కొన్నిమాటలు చెప్పవలెను.

నూతన రాజ్యాంగ విధానముయొక్క చిత్తుచట్టమును గురించి, విదేశ ప్రచురణాల యధికారులవైఖరి, నిస్సందేహముగా మనకొక రకమైన యభిరుచిని గలుగజేయును. బూర్జువా దేశములందలి ప్రజలలోని పలువిధములైన సంఘములయొక్క యభిప్రాయములను వెలువరించు నంతవరకు ఈ చిత్తుచట్టముపైనివారు జేసిన విమర్శనలను త్రోసివేయ వీలుగాదు.

## ఫాసిష్టు విమర్శనలు.

ఈచిత్తుచట్టమునకు విదేశ ప్రచురణాలయాధికారులు ప్రథమమున తటస్థముగానుండిరి. ఈవిషయమునందు తీవ్ర విప్లవ విద్రోహ కరులైన ఫాసిష్టు ముద్రణాలయాధికారులు నాదృక్పథమందున్నారు. ఈవిమర్శకులు, నూతన రాజ్యాంగ విధానము యొక్క చిత్తుచట్టమునుగురించి నిశ్శబ్దముగా నుం డుట యుత్తమమని భావించిరి. వారియుద్దేశ్యము, చిత్తుచట్ట మనునది లేదనియు; అది అసలుత్పన్నము గాలేదనియు, ప్రపంచమునకు చూపదలచిరి. కాని మౌనమును విమర్శ నగా తీసికొన వీలులేదని అనవచ్చును. అయితే; యిది నిజముకాదు. మౌనముగా నుండుపద్ధతి, నిర్లక్ష్యమునుచూపు ప్రత్యేకమైనపద్ధతి. కనుక యిదికూడా యొక విమర్శనయే. అది మూర్ఖమైనది, హేళనాపాత్రమైనది అనుమాట వాస్త వము. (అందరు నవ్వుదురు) కాని వారి మౌనధారణ పద్ధతి నుండి ఏమియు వెలువడలేదు. తుదకు వారు తప్పనిసరియై, కవాటము తెరచి ప్రపంచమునకు నూతన రాజ్యాంగ విధా నముయొక్క చిత్తుచట్టము గలదనియు, అది నిలిచియుండు టయేగాక ప్రజల మనస్సులందు ఒక ద్రోహచింతన కలిగిం చుచున్నదనియు, ప్రకటింపవలసివచ్చెను. దీనికి వ్యతిరేక ముగా జరుగుటకు వీలులేదు. ఈప్రపంచమందొకరకపు ప్రజాభిప్రాయము గలదు. పాఠకులు, జ్ఞానాన్వేషణా తత్ప రులు, సత్యపరిశోధకులు, మొదలయినవారిని వంచించి, సత్యా

మును మరుగుపరుచుట అసాధ్యమైన పని. ఈమోసముతో ఎక్కువ కాలము జరుగదు.

రెండవ తెగను జేరిన విమర్శకులు ఈనూతన రాజ్యాంగవిధానముయొక్క చిత్తుచట్టము గలదని గుర్తించిరి. కాని వారు దానికి ప్రాముఖ్యత నివ్వరు. ఎందువల ననగా అది ప్రధానముగా నూతనరాజ్యాంగవిధానము యొక్క చిత్తుచట్టముగాక యొక తెల్లకాగితము అని తలచెదరు. దాని నొక విలువలేని వాగ్దానముగాను, ఒకరకపు పన్నాగము గాను, ప్రజలను మోసగించుటకు జేసిన ఏర్పాటుగాను భావించెదరు. దీనికితోడు సం. సో. సో. రి. యొక ప్రభుత్వముగాక భూగోళశాస్త్రసంబంధమైన మనోభావనమాత్రమే అగుటచే (అందరు నవ్వుదురు) సం. సో. సో. రి. యింత కన్నను మించిన మంచిచట్టము నివ్వజాలదు అని యనెదరు. అదియొక ప్రభుత్వము గాదుగాన, దాని రాజ్యాంగవిధానము వాస్తవమైన విధానము గాదు. ఇది వింతగా తోచవచ్చును. ఈతెగకు ప్రతినిధివంటిది జర్మనుప్రభుత్వ పక్షపత్రికయగు " డప్చి డిప్లొమాటికు పాలిటికు కరెస్పాండెజ్." ఈ పత్రిక స్పష్టముగా నిస్సందేహముగా సం. సో. సో. రి. యొక్క నూతన రాజ్యాంగవిధానము ఒక ఉత్తవాగ్దానమనియు, మోసమనియు, కల్పితమనియు, ఒక "పొటెంకిన్" (Potemkin) గ్రామమనియు ప్రకటించెను. అది నిశ్చయముగా సం. సో. సో. రి. యొక ప్రభుత్వము గాదనియు, అయితే " కచ్చితముగా నిర్వచింపబడిన భూగోళశాస్త్ర భావనయే గాని తదితరము

గాదని" ప్రకటించినది.(నవ్వు).కనుక దీనినిబట్టి సం. సో.సో.రి. యొక్క రాజ్యాంగవిధానము నిజమైన రాజ్యాంగవిధానము గా తలంప వీలులేదు.

ఇట్టి విపర్యతులను గురించి విశేషముగా చెప్ప నక్కర లేదు.

## ఒక నిరంకుశ ప్రభుత్వాధికారియొక్క కథ.

షెడ్రీయను రషియాదేశపు మహాకవి వ్రాసిన ఒక కల్పితకథయందు ఒక నిరంకుశాధికారియొక్క చిత్రము కవి చాతుర్యముతో చిత్రింపబడినది. అతడు మొండిపట్టు గలిగి కూపస్థ మండూకమువంటివాడు. అతడు ఆత్మవిశ్వాసము గలిగి, అత్యుత్సాహము గలవాడు. అనేకవేల జననాశనము జేసినతరువాత, కొన్నిపట్టణములను పరశురామప్రీతి జేసిన తరువాత అతనికప్పగించిన పరగణాయందు శాంతిస్థాపన జేసి ప్రజలను న్యాయబద్ధులుగా జేసిన తరువాత నలుదిక్కులను చూచెను. అమెరికాను గాంచెను. అది దూరముగానున్న దేశము. అయితే, దానివిషయము బాగుగా తెలియదు. అక్కడ ఒకరకము స్వాతంత్ర్యముండినది. అవియిచ్చుటి ప్రజ లను కలవర పరచుచున్నవి. ఆదేశము ప్రత్యేక పద్ధతులతో పాలింపబడుచున్నది. ఆనిరంకుశాధికారి అమెరికానుగాంచి ఆగ్రహావేశ పరవశుడయ్యెను. "అది ఏరకపుదేశము? ఎక్కడ నుండి వచ్చినది? దేనిపై నాధారపడి యున్నది?" (నవ్వు)

కొన్ని శతాబ్దముల క్రింద యదృష్టవశమున నదికనుగొనబడినది. అనుమాట సత్యము. కనుక ఒక చిహ్నమైనను శేషించ కుండ దానిని మూసివేయుట కష్టసాధ్యమా? "(నవ్వు) ఈ విధముగా తలపోసి అతడు, "అమెరికాను మూసివేయుట" అను నిర్ణయమునకు వచ్చెను.

డప్పిడిప్లొమాటిక్ పాలిటిక్ కరెస్పాండెజ్ "ప్రచు రణ కర్తలైన పెద్ద మనుష్యులు, ఫ్రెడిన్ యొక్క నిరంకుశాధి కారిని అన్ని విషయములలోను పోలియున్నారని నాకు తోచుచున్నది. (నవ్వు) ఈ పెద్దమనుష్యులకు సం. సో. సో. రి. యుండుట కండ్లమంటగానున్నది. 19 సంవత్సరముల నుండి, అత్యున్నత ప్రదేశమందున్నదివ్వెవలె నిలబడియుండి సర్వప్రపంచమందున్న కష్టజీవుల నానందోత్సాహ పూరితుల జేయుచు, వారి దాస్యవిమోచనమునకు ప్రయత్నించుట కార్మికవర్గ శత్రులకు ప్రబలకోపకారణమయ్యెను. ఈ సం. సో. సో. రి. సజీవమై యుండుటయేగాక, అభివృద్ధి జెందుచున్నది. అది ప్రవర్ధమానమగుటయేగాక, సకలభోగభాగ్య సంపన్న మగుచున్నది. అది సకల సంపదల కాలవాలమగుటయేగాక, ఒక నూతన రాజ్యాంగ విధానమునకు చిత్తుచట్టమును వ్రాసి నది. ఆ చిత్తుచట్టము మనస్సు నాందోళనపరచి, పీడిత వర్గ ముల కొక నూతనోత్సాహమును కలుగజేసినది. (నవ్వు) దీని తరువాత జర్మను ప్రభుత్వపక్ష పత్రికా ప్రచురణోద్యో గులైన పెద్దమనుష్యులు కోపగించక ఎటులుండగలరు? ఏర కపు దేశమిది? దేనిపైనది ఆధారపడియున్నది? (నవ్వు) అది

అక్టోబరు 1917లోనే కనుగొనినయెడల, ఒక చిహ్నమైనను లేకుండా దాని నెందుకు మూసివేయకూడదని వారరచెదరు. సం. సో. సో. రి. ను మూసివేయుటకును, అందరు వినునట్లు సం. సో. సో. రి ఒక ప్రభుత్వముగానిలిచి యుండలేదనియు, సం. సో. సో. రి. ఒక భూగోళ శాస్త్రభావన తప్పతదిరము గానవియు ప్రకటించుటకు తీర్మానించుకొనిరి.

**వారిమీద అది ఆధారపడదు**

ప్రెసిడెను, నిరంకుశాధికారి, అమెరికాను మూసివేయ నిశ్చయించుకొనెను. అతడు మూర్ఖుడైనను, యుక్తాయుక్త వివేచనాపరుడు గాన, తన్ను తాను ఉద్ధరించుకొనెను. "ఇది నాపై యాధారపడి యుండనట్లు గోచరించు చున్నది." అని గ్రహించెను. (నవ్వు) జర్మను ప్రభుత్వ పక్ష పత్రికాధిపతులైన పెద్ద మనుష్యులు, కాగితముపై ఒక ప్రభుత్వమును గాని, మరొకదానిని గాని మూసివేయవచ్చునుగాని సత్యము మాట్లాడవలసిన, "అది వారిపైనాధారపడియుండదు." అని గ్రహించు బుద్ధి బలముగలదో లేదో నాకు తెలియదు. (హర్ష ధ్వనులు.)

రాజ్యాంగ విధానము ఒక రిక్తవాగ్దానముఅనియు "పొటెంకిను" (Potern kin) గ్రామమనియు జేసెడి ప్రచారమునకు, కొన్ని వాస్తవికాంశములను గమనించుడని నేను చెప్పెదను. ఆయంశములనుబట్టి సత్యము బోధపడును.

1927లో సం. సో. సో. రి. లోని ప్రజలు బూర్జువా ప్రభుత్వమును కూలద్రోసి, కార్మికవర్గ నియంతృత్వమును

స్థాపించి, సోవియటు ప్రభుత్వము నేర్పాటుజేసిరి. ఇది యదార్థముగాని వాగ్దానముగాదు.

సోవియటు ప్రభుత్వము భూస్వాముల వర్గమును తొలగద్రోసి, కర్షకులకు 150,000,000 "హెక్టర్లభూమిని (1 హెక్టరు 2.471 ఎకర్లు) స్వాధీనముజేసిరి. ఇది పూర్వపుభూస్వాములకు, ప్రభుత్వమునకు, మఠములకు జెందినది. కర్షకుల కంతకు పూర్వమున్న భూమిగాక ఈ భూమి నప్పగించెను. ఇదియొక వాస్తవికాంశముకాని వాగ్దానముగాదు.

తరువాత, సోవియటు ప్రభుత్వము, ధనికవర్గమునుండి, బ్యాంకులు, కర్మాగారములు, రైలుమార్గములు, తక్కిన యుత్పత్తిసాధనములు స్వాధీనము జేసికొనిరి. వానిని సోషలిష్టు ఆస్థిగా ప్రకటించిరి. వీనిని నిర్వహించుట కార్మిక వర్గ మందలి కుశాగ్రబుద్ధులను నియమించిరి. ఇది సత్యముగాని వాగ్దానముగాదు.

## వాస్తవి కాంశములు, వాగ్దానములు గావు.

సోవియటు ప్రభుత్వము, పరిశ్రమలను, వ్యవసాయమును నూతనమైన సోషలిష్టు పద్ధతులపైనను నూతనయంత్రజ్ఞాన పైనను సంస్థాపించెను. సం. సో. సా. రి. లోవ్యవసాయమువలన, యుద్ధమునకు పూర్వమందున్న యుత్పత్తి మొత్తమునకు 15 రెట్లు యిప్పుడు తయారు జేయుచున్నది. మహాసంగ్రామమునకు పూర్వము పరిశ్రమలవలన తయారైన సామగ్రికి 7 రెట్లు

యిప్పుడుత్పత్తిజేయబడుచున్నది. అప్పటి ఆదాయముతో నేటి జాతీయ ఆదాయమును పోల్చిన యిది 4 రెట్లుండును. ఇవి అన్నియు వాస్తవికాంశములుగాని వాగ్దానములు గావు. (కరతాళధ్వనులు).

తరువాత, సోవియటు ప్రభుత్వము, నిరుద్యోగమును నిర్మూలము జేసెను. ప్రతివాడు పాటుబడుహక్కు, విశ్రాంతి తీసికొనుహక్కు, విద్యనభ్యసించుహక్కు, ఆచరణలోనికి తీసికొనివచ్చెను, కార్మికులకు, కర్షకులకు, వైజ్ఞానికులకు, శ్రేష్టమై భౌతిక వైజ్ఞానిక పరిస్థితులను సృజించుటకు పూచీ పడెను. సార్వజనీన ప్రత్యక్షసమాన నియోజనమునందు రహస్యవిధానమును ఆచరణయందుపెట్టుటకు పూచీపడెను. (హర్షధ్వనులు). ఇవియన్నియు నిజమైన విషయములుగాని ఖాళీమాటలుగావు.

తుదకు సర్వసామాన్యముగా తెలిసిన విషయములను శాసనరూపమున "రికార్డు" జేసియు, ఇంతవరకు సాధించిన విషయములను శాసనముగా వ్రాసి ఎక్కువ హామీయిచ్చుటకై ఈ నూతనరాజ్యాంగ విధానముయొక్క చిత్తుచట్టమును సం. సో. సో. రి. ప్రసాదించినది.



# అధ్యాయము 5.

## విమర్శకులకు ప్రత్యుత్తరము.

## పక్షము లాక్రమించుకొనిన స్థానములు.

జర్మనుప్రభుత్వపక్ష పత్రికాధికారుల "పొటెంకిన్" గ్రామమునుగురించిన పనికిమాలినమాటలయొక్క భావమే మను ప్రశ్న యుదయించును. సం. సో. సో. రి. ను గురించిన సత్యమును ప్రజలనుండి మరుగుపరచుట, వారిని తప్పుడు దారిలో పెట్టుట, వారిని మోసగించుట దానిభావమై యున్నది.

ఇవి వాస్తవికాంశములు. సత్యమనునది సరళమైనది. కాని జర్మనుప్రభుత్వ పక్షపత్రికకుజెందిన పెద్దమనుష్యులు, "కాబట్టి ఆ అంశములు మరీ ఎక్కువ పనికిమాలినవి" అని చెప్పవచ్చును. అయితే రషియాదేశమందలి "శుంఠలకొరకు న్యాయసూత్రములు వ్రాయబడలేదు" అను ప్రసిద్ధమైన సామెతను వారికి సమాధానముగ చెప్పవచ్చును. (హర్ష ధ్వనులు).

మొదటిరకమునకు జేరిన విమర్శకులు, నూతన రాజ్యాంగవిధానముయొక్క చిత్తుచట్టమునందు కొన్ని యోగ్యతలు గలవని యంగీకరించెదరు. దానిని ఒక ముందంజగా భావింతురు. కాని దానియందలికొన్ని నిబంధనలను కార్యరూపమిచ్చుట సందేహాస్పదమని తలంతురు.

ఎందువలననగా వారు ఈ నిబంధనలను ఆచరణయందు పెట్టుట కష్టసాధ్యమనియు, అవి కాగితముపై మాత్రమే యుండుననియు, దృఢనిశ్చయముతో నున్నారు. వీరు సంశయ గ్రస్తులు (దీర్ఘసూత్రులు–sceptics) అని చెప్పవచ్చును. ఇట్టి సంశయగ్రస్తులు అన్నిదేశములందును గలరు.

మనము అట్టివారిని కలిసికొనుట మొదటిపర్యాయము గాదని చెప్పక తప్పదు. బోల్షివిక్కులు, ప్రభుత్వాధికార మును 1917 లో వహించినప్పుడు, "బోల్షివిక్కులు బహుశః చెడ్డవారు గారు. ఈప్రభుత్వభారమును వహింపజాలరు, కనుక వారు దానిక్రింద కృంగి నశించెదరు." అని వీరు చెప్పిరి. సత్యముగా బోల్షవిక్కులుగాక, సంశయగ్రస్తులే ఓడిపోయిరి.

## వారప్పుడు చెప్పినది.

అంతఃకలహకాలమున విదేశప్రభుత్వ సైనిక ప్రవేశ మప్పుడు, ఈసంశయగ్రస్తులు, "సోవియటు ప్రభుత్వము దుష్ట మైనదిగాదు. అయితే డెనికిన్, కోల్‌చాక్, విదేశస్థులుగలిసి దీనినిజయించగలరని మేము నిస్సంశయముగా చెప్పవచ్చును." అని యనుకొనిరి. కాని వాస్తవముగా ఈసంశయగ్రస్తులే తప్పులెక్కవేయుట స్పష్టమగుచున్నది.

సోవియటుప్రభుత్వము ప్రథమ పంచవత్సర ప్రణాళి కను ప్రచురించినప్పుడు ఈసంశయగ్రస్తులు, "పంచవత్సర

ప్రణాళిక మంచిదే, కాని దానిని నిర్వహించుట దుర్ఘటము. ఈబోల్షివిక్కులు ఈ ప్రణాళిక నాచరణయందుంచలేరు." అని తలచిరి. కాని వారు ఈతూరికూడా దురదృష్టవంతులుగా కనుబడిరి. ఈ పంచవత్సర ప్రణాళికను నాలుగు సంవత్సరములలోనే నిర్వహించిరి.

నూతన రాజ్యాంగ విధానముయొక్క చిత్తుచట్టమును గురించి ఈసంశయగ్రస్తులు జేసెడి విమర్శనలకుకూడా పై విధముగనే జవాబు చెప్పవచ్చును. ఈనూతన రాజ్యాంగ విధానముయొక్క చిత్తును ప్రచురించినంతనే ఆయవకాశ మునుగొని ఈసంశయగ్రస్తులు ఆయాసమును గలుగజేసెడి సందేహములతో అందలి కొన్ని నిబంధన లాచరణయోగ్య మాయను యనుమానముతోను, కనబడిరి. ఈతూరికూడా ఈసంశయగ్రస్తులే మోడిపోదురనుటకు సందేహమేమాత్రము లేదు. పూర్వము అనేకపర్యాయములు తప్పిపోయినట్లుగ ఈతడవకూడ వీగిపోదురు.

నాల్గవ రకమునకు జేరిన విమర్శకులు, ఈ చిత్తు చట్టము నెదుర్కొనుచు, దానిని, "కుడిపార్శ్వమునకు మఱలుట." అనియు, "కార్మికవర్గ నియంతృత్వమును త్రోసివేయుట" అనియు, "బోల్షివిక్కులు కుడిపార్శ్వమునకు ఊగినమాట వాస్తవము,'' అని అనేకవిధములైన స్థాయితో పల్కిరి. ఈవిధమైన విమర్శన జేయుటయందు అత్యుత్సాహమును చూపినవి కొన్ని హాలెండు అమెరికా వార్తాపత్రికలు.

## పీ ఠ వ్యా ప క త.

కార్మికవర్గనియంతృత్వ పీఠమును విస్తరింపజేసి సంఘ వ్యవస్థను నడుపు యధికారమును ప్రభుత్వపరము జేసి, దానిని శక్తివంతమైనదిగాను, సరళమైనట్టిదిగాను జేయుటను, కార్మిక వర్గనియంతృత్వమును బలపరచుటగాక, దానిని బలమైనదిగా జేయుటగాను, దానిని త్రోసివేయుటగాను, తలచెదరు. అప్పుడు వారిని మనము, "కార్మికవర్గ నియంతృత్వమన నేమియో ఈపెద్దమనుష్యులకు తెలియునా?" అని అడుగ వచ్చును.

సోషలిజముయొక్క విజయమును శాసనరూపముగా క్రోడీకరించుటను, ప్రజాస్వామ్యమును, సమిష్టివ్యవసాయిక పద్ధతిని, పరిశ్రమలవ్యాప్తిని శాసనముద్వారా దృఢీకరించుటను, "మితవాదపక్షమునకు మరలుట" అనిన మనము వారిని "ఈ పెద్దమనుష్యులకు మితవాద అతివాదములకు భేదమెందుగలదో తెలియునా?" అని ప్రశ్నింప వీలగునా? (హర్షధ్వనులు).

ఈ నూతనరాజ్యాంగవిధానముయొక్క చిత్తును విమర్శించుటయందు చిక్కుకొని మితవాద, అతివాదవ్యత్యాసములను గ్రహింపలేకపోయిరనుట నిస్సందేహము.

ఈసమయమందు, గోగల్ యొక్క "మరణించిన యాత్మలు" అనెడి పుస్తకమందు చిత్రించిన బానిసపిల్ల ఎవరికైనను జ్ఞప్తికివచ్చును. గోగల్ చెప్పినట్లుగా, ఆమె ఒక

దినము, చిచికావ్ యొక్క గుఱ్ఱపుబండి తోలువాడైన సెలిఫాను అను వానికి మార్గమును మాటలతో చెప్పుటకు సమ్మతించి, ఆరోడ్డుయొక్క కుడిఎడమలను గుర్తింపలేక, చికాకుపడెను. పొలెండులోని వార్తాపత్రికలందలి విమర్శకులకు, వారి యాశయము లెటులుండినను, "మరణించిన యాత్మల"లోని బానిసపిల్లయగు పెలాగా కున్న జ్ఞానమైనను వీరికి లేకున్నదని ఒప్పుకొనక తప్పదు. (హర్షధ్వానులు). కుడిని ఎడమతో భ్రమపడుటచే, సెలిఫాను, అతనిమనస్సులోని మాటను వెలువరింపవలసి వచ్చినది. అప్పుడు పెలాగాతో "ఓ నల్లపిల్లా! ............నాకు కుడిఏదో ఎడమ ఏదో తెలియదు" అని చెప్పెను. ఇదేరీతిగా ఈ దురదృష్టవంతులైన విమర్శకులను దూషించి, "ఓ దురదృష్టవంతులారా! మీకు ఏదికుడియో, ఏది ఎడమయో తెలియదు," అని చెప్పవలసియుండును (కరతాళధ్వానులు).

## తక్కిన విమర్శకులు

తుదకు, మరొక రకపు విమర్శకులున్నారు. అదివరకు వారు కార్మిక వర్గనియంతృత్వము నీచట్టము త్రోసివేయుచున్నదని నేరమారోపించుచుండ, దానికి వ్యతిరేకముగా, ఈ గుంపుకు చేరినవారు, సం. సో. సో. రి. యందలి పరిస్థితులందేమాత్రము మార్పు జేయలేదనియు, కార్మికవర్గనియంతృత్వమును కదల్చకుండ నిలిపియుంచిరనియు, రాజకీయ పక్షములకు స్వాతంత్ర్య మివ్వలేదనియు, సం. సో. సో. రి. లో కమ్యూనిష్టు పక్షమునకు ప్రస్తుతమున్న ప్రాధాన్యమింకను

యమములనందుంచిరనియు, నేరముల నాపాదించెదరు. ఈ విమర్శకులు, సం. సో. సో. రి. నందు రాజకీయ పక్షములకు స్వాతంత్రములేదు గనుక ప్రజాస్వామ్య సూత్రములు భంగపరుపబడినవని భావించెదరు.

ఈ నూతన రాజ్యాంగ విధానముయొక్క చిత్తుచట్టము కార్మికవర్గనియంతృత్వ ప్రభుత్వమును అమలునందుంచును. సం. సో. సో. రి. లోని కమ్యూనిష్టు పక్షముయొక్క ప్రస్తుత ప్రధాన స్థానమునుండి మార్పులేదని నేను ఒప్పుకొనక తప్పదు (కరతాళధ్వనులు.) ఆఘనులైన విమర్శకులు దీనినొక లోపముగా భావించిన, అది విచారణీయమైనది. బోల్షివిక్కులమైన మేము, ఇది నూతన రాజ్యాంగ విధానముయొక్క గొప్ప లక్షణమని నమ్ముచుంటిమి. (హర్షధ్వనులు.)

రాజకీయ కక్షల స్వాతంత్రమునుగురించి మాకుకొద్దిగా భేదాభిప్రాయములుగలవు. ఒక పక్షము, ఒక వర్గముయొక్క భాగము, అది ముందంజవేసినభాగము, ఒక సంఘమందు విరోధ వర్గములున్నయెడల, ఒకరి ప్రయోజనము లొకరికి ప్రతికూలమై పరస్పర విరుద్ధమైనయెడల, దానియందు ధనికవర్గము కార్మికవర్గము, భూస్వాములు కర్షకులు మొదలైనవారుండినయెడల, అనేక పక్షములు, వారికివాక్స్వాతంత్ర్యము ఉండును. అనేకవర్గములులేవు గనుక అనేక పక్షము లగత్యములేదు. సం. సో. సో. రి. లో కార్మికులు కర్షకులు అనెడి రెండు వర్గములు మాత్రమేగలవు. ఒకరి ప్రయోజనములు మరొకరికి ప్రతికూలములైనవి కాకుండుటయేగాక, దానికి

విరుద్ధముగా, వారుమిత్రులు కాబట్టి సం. సో. సో. రి. లో అనేక పక్షములకు తావులేదు. ఒక పక్షమునకు మాత్రమే యవకాశముగలదు. అది కమ్యూనిష్టు పక్షము. కార్మిక కర్షకుల ప్రయోజనములరక్షించి కాపాడునట్టి కమ్యూనిష్టు పక్షము ఒక్కటి మాత్రమే సం. సో. సో. రి. నందు నిలిచియుండగలదు. ఈ వర్గములయొక్క లాభములను సక్రమముగానే సంరక్షించుచున్నదనుటయం దణుమాత్రమైన సందేహము లేదు (హర్షధ్వనులు.)

ప్రజాయత్త ప్రభుత్వమును గురించి ప్రజలు మాట్లాడెదరు. అయితే, ప్రజాస్వామ్యమననేమి? విరోధ వర్గములుండెడి కాపిటలిష్టు దేశములందు ప్రజాస్వామ్యము, అంత్యవృద్దక్కరణమందు, బలవంతులైనట్టి, సంపన్నులగు అల్పసంఖ్యాక ప్రజల ప్రభుత్వముగాని తదితరముగాదు. సం. సో. సో. రి నందున్న ప్రజా ప్రభుత్వము, దీనికి వ్యతిరేకముగా, కష్టజీవుల ప్రజాస్వామ్యము అదిసార్వజనిక ప్రజా ప్రభుత్వము, బూర్జువా రాజ్యాంగ విధానములు, ప్రజాయత్తప్రభుత్వ నిర్మాణ సూత్రములనుల్లంఘించినవిగాని, సం. సో. సో. రి. యొక్క నూతన రాజ్యాంగ విధానముల్లంఘింపలేదు అని దీనివలన విదితమగుచున్నది. కనుక, నేను సం. సో.సో. రి. యొక్క నూతన రాజ్యాంగ విధానమే పూర్తిగా సరళమైన ప్రజాస్వామ్య విధానము కాని మరియితరము లీ ప్రపంచమందు కావు అని తలచెదను,

సం. సో. సో. రి. యొక్క నూతన రాజ్యాంగ విధానము యొక్క చిత్తు చట్టముపై బూర్జువా విమర్శన లీవిధముగా నున్నవి.

# అధ్యాయము 6

## సవరణలు, ప్రతిపాదనలు.

ఈ చిత్తుచట్టముపై సర్వజనుల వాదప్రతివాదనల ఫలితముగా పౌరులు జేసిన సవరణలు చేర్చిన క్రొత్తక్లాజులను గురించి మనమిప్పుడు ఆలోచించుదము.

ఈ నూతన రాజ్యాంగవిధానముయొక్క, చిత్తునకు సర్వజన చర్చవలన అనేకమైన సవరణలు, క్రొత్తయుపపాదనలు వచ్చినవి అని మనకు తెలియును. అవియన్నియు సోవియటు ముద్రణాలయములందు ప్రచురింపబడినవి. అనేకరకములైన సవరణలు వచ్చుటచేతను, అవి విలువయందు తారతమ్యము గలవగుటచేతను, వానిని మూడుభాగములుగా విభజించుట యుత్తమమని నేను తలచితిని.

మొదటిరకమునకు జేరిన సవరణలయొక్క ప్రధాన లక్షణము, అవి నూతన రాజ్యాంగవిధానమును గురించిగాక భవితవ్యమందేర్పడనున్న శాసనసభలవిషయమై యున్నవి. ఇప్పుడమలునందున్న చట్టములను ఆ భవిశ్శాసనసభలు అంగీకరించునా, అంగీకరించదా అను విషయమునకు సంబంధించినవి. అనేకమైన భీమాప్రశ్నలు, సమిష్టిఫారముల నిర్మాణమునుగురించిన ప్రశ్నలు, పరిశ్రమల నిర్మాణముపై

కొన్ని సమస్యలు, దేశాదాయము పై కొన్ని ప్రశ్నలు—ఈసవరణలయొక్క విషయమిట్టిది. బహుశః ఈ సవరణకర్తలు, రాజ్యాంగవిధాన సమస్యలకు ప్రస్తుత శాసననిర్మాణసమస్యలకు భేదమును గమనించలేదు. అందువలన రాజ్యాంగవిధానములోనికి, అత్యధికసంఖ్యాకమయిన న్యాయసూత్రములను ప్రవేశపెట్ట ప్రయత్నించెదరు. అందువలన రాజ్యాంగవిధానమును శిక్షాస్మృతికి రూపాంతరముజేయు పరిస్థితులేర్పడును.

అయితే, రాజ్యాంగవిధానము ధర్మసంపుటీకరణము గాదు. రాజ్యాంగవిధానమనునది ఆధారసూత్రముమాత్రమే రాజ్యాంగవిధానమందు నేడమలునందున్న న్యాయసూత్రములు జేర్చబడవు. భవిష్యత్తునందేర్పడనున్న శాసనసభలు, నేడమలునందున్న శాసనములుండినవని యూహించి, వాని నాధారముగా గొనును. ఆశాసనసభలకు న్యాయసమ్మతమైన యాధారమును రాజ్యాంగవిధాన మేర్పాటుజేయును. కనుక ఈరకమునకు జేరిన సవరణలు మొదలైనవి. భవిష్యత్శాసన సభలకు వదలుట యుత్తమమని నాయభిప్రాయము.

చరిత్రాత్మకసమాచారములును, సోవియటు ప్రభుత్వమిప్పటికి సాధింపనిదానిని, యిక భవిష్యత్తునందు సాధింపగల దానిని గురించిన ప్రకటనను ఈనూతనరాజ్యాంగవిధానముయొక్క చిత్తునందు చేర్చుకోరెడి సవరణలు, ఉపపాదనలను, మనము రెండవ భాగముగా చేయవచ్చును. పక్షము, కార్మికవర్గము, కష్టజీవులు సోషలిజ విజయమునకై అనేకవత్సరముల నుండి పడ్డ పాట్లను నూతన రాజ్యాంగవిధానమందు పేర్కొ

నుట! రాజ్యాంగవిధానమందు సోవియటు ప్రభుత్వముయొక్క తుదిఆశయము సంపూర్ణ కమ్యూనిష్టుల సంఘస్థాపనయే యని పేర్కొనుట;—

ఈసవరణ లేవిధముగా వ్రాసినను వానియొక్క భావ మిదియే. కనుక ఈసవరణలు, ప్రతిపాదనలకు, రాజ్యాంగ విధానముతో నెట్టి సంబంధములేదు. గనుక, వానినికూడ మనము వదలివేయవలెనని నేను తలచుచున్నాను. ఇంతవరకు సాధించినట్టియు, నిర్వహింపగలిగినట్టియు, భద్రపరచినట్టి విషయములను న్యాయసమ్మతముగా, రికార్డు చేయునది, క్రోడీకరించునది రాజ్యాంగ విధానము, కనుక ఈ రాజ్యాంగ విధానముయొక్క ముఖ్యమైన స్వభావమును మనము వక్ర ముగా జేయవలెనని తలచకపోయినయెడల, దానిని, భూత కాల చరిత్రాంశములచేగాని, భవిష్యత్తునందు సం. సో. సో. రి. నందున్న కష్టజీవులు సంపాదింప గలిగిన యంశములను గురిం చిన ప్రకటనతోగాని నింపనగత్యములేదు. దీని కొరకు మన కితర సాధనములు, పత్రములుగలవు.

తరువాత, నూతన రాజ్యాంగ విధానముపై సక్రమ ముగా ఆధారపడియున్న సవరణలను, ఉపపాదినలను, మనము మూడవ భాగముగా చేయవచ్చును.

ఈ రకమునకు జేరిన సవరణల యందధికభాగము సం పాదకీయ లక్షణాన్ని కలిగియున్నవికాన ఈ కాంగ్రెసు నియ మింపనున్న సంపాదకీయ సంఘమునకు వానిని వదలివేసి,

వారిని ఈ నూతన రాజ్యాంగ విధానముయొక్క ఆఖరు ముద్రణమును తయారుజేయ నాజ్ఞాపించిన యుక్తమని నాకు తోచుచున్నది.

ఈ మూడవ రకమునకు జేరిన తక్కిన సవరణలు ఎక్కువ ప్రాముఖ్యముగలవి. కనుక వాటిని గురించి క్లుప్తముగా చెప్పవలసియున్నది.

1. మొట్టమొదట ఈ రాజ్యాంగ విధానముయొక్క ప్రథమ నిబంధనపైవచ్చిన సవరణల విషయమాలోచింతము. నాలుగు సవరణలున్నవి. కొందరు "కార్మికుల ప్రభుత్వము," అనెడి మాటలకు బదులు, "కష్టజీవుల ప్రభుత్వము'' అని చేర్చ గోరెదరు. మరికొందరు "కార్మికుల కర్షకుల ప్రభుత్వము'' అనుమాటకు ''మరియు శ్రమచేయుచున్న విద్యాధిక తెగ" అను మాటలను చేర్పమని కోరెదరు మరికొందరు, "కార్మిక కర్షకుల ప్రభుత్వము," స్థానే, "సం.సో. సో. రి. నందు నివసించియున్న అన్నిజాతులకు తెగలకు జెందిన ప్రభుత్వము," అని చేర్చకోరిరి. ఇంకా మరికొందరు, "కర్షకుడు" అనుమాట బదులు, "సమిష్టి కృషీవలుడు," అనిగాని, లేక "సోషలిష్టు వ్యవసాయమందలి కష్టజీవులు,'' అనిగాని చేర్చ ప్రతిపాదించిరి.

ఈ సవరణల నంగీకరింపవలెనా? అవి యంగీకరించ నక్కరలేదని నేను తలంచు చుంటిని.

చిత్తుచట్టమందలి మొదటి ఆర్టికిల్ దేనిని గురించియై యున్నది? అది సోవియటు సంఘమందలి వర్గ సమాకరణ

మును గురించియై యున్నది. రాజ్యాంగ విధానమందు మార్క్సు తత్వవాదులమైన మనము మన సంఘమందున్న వర్గ సమాకరణమును గురించిన ప్రశ్నను తలపెట్టనక్కరలేదా? దానిని మనము వదలివేయ వీలులేదు. సోవియటు సంఘమందు కార్మికులు కర్షకులు అనెడి రెండువర్గములు మాత్రమే గలవు. దీనిని గురించియే మొదటి ఆర్టికిల్ వున్నది. కాబట్టి, చిత్తు చట్టమందలి ప్రథమనిబంధన మన సంఘముయొక్క వర్గ సమాకరణను స్పష్టముగా ప్రతిఫలింప జేయుచున్నది. కష్టపడెడి వైజ్ఞానికుల గురించి యది ప్రతి ఫలింప జేయుచున్నదా అని యడుగవచ్చును. విద్యావంతులు పూర్వమందుగాని, యిక ముందుగాని ఒక వర్గముగాజాలదు. సంఘమందున్న వర్గముల నుండి దాని సభ్యులను అది సమకూర్చుకొనును, గాన యది ఒక అంతరముగానే యుండును. పూర్వకాలమందు, రాజ బంధువులనుండి, బూర్జువా వర్గమునుండి ఎక్కువ మందియు, కర్షకులనుండి కొలదిమందియు, కార్మికులనుండి అతిస్వల్ప సంఖ్యాకులు, విద్యావంతులుగా నగుచుండిరి. మన సోవియటు ప్రభుత్వకాలమందు, కార్మికులు కర్షకులనుండియే వైజ్ఞానిక తెగకు సభ్యులు గైకొనబడుచుండిరి. ఏ విధముగా సభ్యులైనను ఎట్టి స్వరూపము దానికున్నను, ఈవిజ్ఞానధనులొక యంతరము మాత్రమేగాని వర్గము మాత్రము కాజాలదు.

అయితే, పాటుబడెడి విజ్ఞానులయొక్క హక్కుల కీయంశ మేవిధమైన యాటంకముగానైనా యుండునా? అటు గాజాలదు. చిత్తుచట్టమందున్న ప్రథమనిబంధన, సోవియటుసంఘ

మందున్న వివిధయంతరములయందలి వ్యక్తులయొక్క హక్కులను గురించిగాక, సంఘముయొక్క వర్గనిర్మాణమును గురించి తెల్పుచున్నది. సోవియటుసంఘమందున్న వేరువేరు యంతరములలోని వారి హక్కులను, పాటుబడెడి విజ్ఞానుల హక్కులతో కలిపి, చిత్తుచట్టముయొక్క 10, 11వ అధ్యాయములందు ముఖ్యముగా పేర్కొనబడినవి. ఈఅధ్యాయములనుండి, కార్మికులు కర్షకులు, శ్రమచేచెడి కష్టజీవులు, దేశమందలి ఆర్థిక, రాజకీయ, వైజ్ఞానిక జీవనగోళములందు సమానమైన హక్కులు గలిగియున్నారని విదితమగును, కాబట్టి, కష్టబడెడి వైజ్ఞానులయొక్క హక్కుల నరికట్టెడి ప్రశ్న యుదయించదు.

సం. సో. సో. రి. నందున్న జాతులు, తెగలనుగురించి ఈ జవాబే ఇవ్వవచ్చును. చిత్తుచట్టముయొక్క రెండవ అధ్యాయమునందు, సం. సో. సో. రి. సమానహక్కులుగల స్వతంత్ర జాతులయొక్క సమితిగాని నిర్వచింపబడినది.

వర్గసమీకరణమును గురించి చెప్పెడి ప్రథమనిబంధనయందు సోవియటుసంఘమునందలి జాతుల సమీకరణమును పేర్కొనుట యుక్తమా? అది సమంజసము గాదని స్పష్టమగుచున్నది. సం. సో. సో. రి. లో జేరిన జాతులయొక్కయు తెగలయొక్కయు, హక్కులను గురించి, 2, 10, 11 వ అధ్యాయములందు తెల్పబడినది. ఈ అధ్యాయములనుండి సం. సో. సో. రి. నందున్న జాతులు, తెగలు, ఆర్థికరాజకీయ వైజ్ఞాన జీవనగోళములందు సమానహక్కులు గలిగి యున్నా

రని స్పష్టపడుచున్నది. కనుక జాతుల హక్కు లేమాత్రము అరికట్టబడ లేదు.

"కర్షకుడు" అనుమాటను తొలగించి దానిబదులుగా "సమిష్టి కృషీవలుడు" అనిగాని, "సోషలిష్టు వ్యవసాయిక కష్టజీవుడు," అనిగాని ఉపయోగించుటతప్పు. మొట్టమొదట, సమిష్టి కృషీవలుడుగాక, కర్షకులందు, సమిష్టి వ్యవసాయి మందు జేరనివారు 1000,000 పైగానున్నారు. వారివిషయ మేమి? ఈ సవరణకర్తలు వారిని నిరాకరింప నాలోచించుట గాదా ? అది అన్యాయమైనది రెండు, వారియందధిక సంఖ్యాకులు సమిష్టి వ్యవసాయము చేయుచున్నంత మాత్రముననే వారు కర్షకవర్గత్వమును వదలుకొనిరనిగాని, వారికెట్టి వ్యక్తిగత మైన యాస్థులు లేవని గాని వారికి స్వంతపొలములు మొదలైనవి లేవనిగాని భావించుట పొరబాటు. మూడు అప్పుడు, "కార్మికుడు," అను పదముస్థానే, "సోషలిష్టు పరిశ్రామిక కష్టజీవుడు," అనుమాట లుపయోగించ నవసరమగును, కాని ఈ సవరణకర్తలు ఏకారణముచేతనో దీనిని ప్రతిపాదించలేదు. ఆఖరుకు, మన దేశమందు కార్మికవర్గము, కర్షక వర్గము, యిప్పటికి అంతర్హితమైనదని చెప్ప సాధ్యపడునా? వారు అంతర్హితము గాకపోయిన, వారికి పర్యాయపదములుగా స్థాపింపబడి, నిఘంటువునం దుపయోగించబడిన పదములను కొట్టివేయవలసినదేనా? ఈ సవరణకర్తల మనంబులందు వర్తమాన కాలముగాక, భవిష్యత్కాలమం దుండెడి సంఘము యుండి యుండ వచ్చును. అప్పుడు వర్గము లంతరించును.

అప్పుడు కార్మికులు కర్షకులు ఒక కమ్యూనిష్టు సంఘమందు పాటుపడెడి వారగుదురు. కాబట్టి, వారు స్పష్టముగా దీనిని తలక్రిందుజేసిరి. అయితే రాజ్యాంగ విధానమును చిత్రించునప్పుడు, భవిష్యత్కాలమునుండిగాక, ప్రస్తుతమునందున్న పరిస్థితులనుండియే బయలుదేరవలెను. రాజ్యాంగవిధానమును అవక్షేపము జేయకూడదు.

(2) చిత్తుచట్టమునందున్న 17 వ నిబంధనకు సవరణ తరువాత వచ్చును. సం. సో. సో. రి. నందలి పబ్లిక్కులు (ప్రజాయత్త ప్రభుత్వములు) విడిపోవు స్వాతంత్ర్యమునుగల హక్కును తెలియజేయు 17 వ నిబంధనను చిత్తుచట్టమునుండి సంపూర్ణముగా తొలగింపవలెనని ప్రతిపాదనగలదు. నేను ఈప్రతిపాదన అసంగతమైనదనియు, ఆకారణమువలన ఈ సభవారామోదింపకూడదనియు కోరుచున్నాను. సం. సో. సో. రి. యిచ్ఛాపూర్వకముగాజేరిన ప్రజాయత్త ప్రభుత్వముల (రిపబ్లిక్కుల) సమితి. వాని కన్నివిషయములందు సమానహక్కులు గలవు. సం. సో. సో. రి. నుండి విడిపోవు హక్కును సూచించెడి నిబంధనను రాజ్యాంగవిధానమునందు వదలివేసినయెడల, ఈ సమితియొక్క స్వతంత్ర స్వభావమును భంగపరుచుటయగును, ఈ కార్యమునకు మనము సమ్మతింపగలమా? మనము దీనిని ఒప్పుకొనగూడదని నాయభిప్రాయము. సం. సో. సో. రి. లో ఒక రిపబ్లిక్కైనను విడిపోవు నుద్దేశ్యము లేదని చెప్పవచ్చును; ఈ దృక్పథము నుండి 17 వ నిబంధనకెట్టి ప్రాముఖ్యతయులేదు. ఒక్క

రిపబ్లిక్కైనను సం. సో. సో. రి. నుండి విడిపోవుటు ద్దేశ్యమణు మాత్రమైనను లేనిమాట వాస్తవము. సం. సో. సో. రి. నుండి విడిపోవుస్వాతంత్ర్యము, అందున్న రిపబ్లిక్కులకు రాజ్యాంగ విధానమునందు లేకుండా చేయకూడదు. సం. సో. సో. రి. నందు ఒక ప్రజాసామ్యమును అణచివేయుదలచెడి మరొక ప్రజాసామ్యము లేదు. దీని పర్యవసానముగా, సమితి యందలి ప్రజాస్వామ్యములయొక్క సంపూర్ణ సమానత్వ హక్కులను గురించియున్న ఆర్టికల్‌ను రాజ్యాంగవిధానము నుండి తొలగింపగూడదు.

(3) చిత్తుచట్టము యొక్క రెండు అధ్యాయమునకు ఒక క్రొత్త నిబంధన చేర్పమని యొక ప్రతిపాదనగలదు. దాని యొక్క సారాంశమేమన, స్వపరిపాలిత సోషలిష్టు సోవియటు రిపబ్లిక్కు, ఆర్థికముగాను వైజ్ఞానికముగా అభివృద్ధిజెంది ఒక నిర్దిష్టమైన యంతరము జేరిన తరువాత, సోషలిష్టు సోవియిటు సమతిగా రూపాంతరము జెందవలెనని. ఈ ప్రతిపాదనము స్వీకరింపవచ్చునా? అది స్వీకరింపకూడదని నేను అభిప్రాయ బడుచున్నాను. దాని సారాంశమును బట్టియేగాక, దాని యుద్దేశ్యములనుండియు, అదితప్పు. ఒక ప్రజాస్వామ్యమును దాని యొక్క ఆర్థిక వైజ్ఞానికి అధోగతి వలన స్వపరిపాలిత రిపబ్లిక్కుల పట్టియందు యవిచ్ఛిన్నముగా నుంచుట ఎటుల న్యాయసమ్మతముగాదో, అదేవిధముగా స్వపరిపాలిత రిపబ్లిక్కులు వాని యార్థిక వైజ్ఞానికాభివృద్ధి ననుసరించి యూని యను రిపబ్లిక్కుల శ్రేణిలోనికి మార్చుటయు న్యాయసమ్మ

కముగాదు. ఇది మార్క్సుయొక్క గాని, లెనిను యొక్క గాని సిద్ధాంతములకు విరుద్ధమైనది. తార్తారు ప్రజాస్వామ్యము స్వపరిపాలిత ప్రభుత్వముగానుండగా, కజక్కు ప్రజాప్రభుత్వము యూనియను రిపబ్లికు అగును. కజక్కు రిపబ్లిక్కు, ఆర్థిక వైజ్ఞానిక యభివృద్ధి దృక్పథమునుండి, తార్తారు రిపబ్లిక్కుకంటె గొప్పదని దీనియర్థముగాదు. దీనికివ్యతిరేకమైనది సత్యము. ఉదాహరణకు, జర్మనులయొక్క స్వపరిపాలిత రిపబ్లిక్కును. ఖర్గీజుయూనియన్ రిపబ్లిక్కును గురించి పైవిధముగానే చెప్పవలసియున్నది. కాని మొదటపేర్కొనిన వాల్గా జర్మనుల రిపబ్లికు, స్వపరిపాలిత ప్రజాస్వామ్యముగా నున్నను, రెండవదియు కిర్ఘిజ్ ప్రజాస్వామ్యము కన్న ఆర్థికముగాను వైజ్ఞానికముగాను పైయంతరమందున్నది.

# అధ్యాయము 7

## స్వపరిపాలిత ప్రజాస్వామ్యములు.

స్వపరిపాలిత ప్రజాస్వామ్యములను సమితి ప్రజాస్వామ్యముల శ్రేణికి చేర్చుటకెట్టి ముఖ్యలక్షణముల నాధారముగా గైకొనవలెను? దీనికి మూడుముఖ్యలక్షణము లున్నవి.

మొట్టమొదట ఆప్రజాస్వామ్యము సరిహద్దుపరగణాలలో నుండవలెను. అది అన్నిప్రక్కలను సం. సో. సా. రి. యొక్కభూమిచే యావృతము కాకూడదు. ఎందువలన?

సం. సో. సో. రి. నుండి విడిపోవుహక్కు ఒక సమితిప్రజా ప్రభుత్వము నిలుపుకొనిన, ఈస్వపరిపాలితరిపబ్లిక్కుకూడా సమితిలోని రిపబ్లికుకాగానే దానికికూడా యిట్టిహక్కు వుండును. కనుక సం. సో. సో. రి. నుండి విడిపోవు ప్రశ్నను తార్కికముగాను, వాస్తవికముగాను, గొనిరాగల శక్తి వచ్చును. అట్టిప్రశ్నను తేగల ప్రజాస్వామికము అన్యదేశ సరిహద్దులందుండి, నలుప్రక్కలను సం. సో. సో. రి. యొక్క భూభాగముచే చుట్టబడి యుండగూడదు. సం. సో. సో. రి. నుండి విడివడదలచెడి ప్రజాస్వామికమందు లేనిమాట నిజము. అయితే సం. సో. సో. రి. నుండి విడిపోవుహక్కు అందలి ప్రజాస్వామ్యమున కెంతకాలము వరకుండునో, అంతవరకు ఆహక్కును అర్థములేని చిత్తుకాగితముగా మార్చకుండుటకై పరిస్థితులను సక్రమమైనపద్ధతులలో నిర్మించవలెను. ఉదాహరణకు బాష్కీరుగాని, తార్తారుప్రజాయత్త ప్రభుత్వమును గాని తీసికొనుడు. ఈస్వపరిపాలిత ప్రజాస్వామ్యములను, రిపబ్లిక్కుల సమితిశ్రేణిలోనికి మార్చితిమని యనుకొనుడు. అయితే వారు తార్కికముగాను, వాస్తవముగాను సమితి నుండి విడిపోవుప్రశ్నను తేగలరా? వారు తేజాలరు. ఎందువలననగా, వారు నలుప్రక్కల సోవియటు రిపబ్లిక్కులు,పరగణాలచే నావృతమై యున్నారు. సత్యముగా వారు సం. సో. రి. నుండి ఎక్కడికిని పోజాలరు. (హర్షధ్వానులు) కాబట్టి ఈప్రజాస్వామికములను సమితిశ్రేణిలోనికి మార్చుట తప్పు.

రెండు, సోవియటు రిపబ్లిక్కులకు ఏజాతిపేరు ఇవ్వబడి నదో, అది ఆరాజ్యమందు అవిచ్ఛిన్నమైన యధిక సంఖ్యా కులుగా నుండవలెను. ఉదాహరణకు క్రిమియను రిపబ్లికును తీసికొనుడు. అది సరిహద్దులోనిది. కాని అందలి తార్తారులు అధిక సంఖ్యాకులుగారు. దీనికి వ్యతిరిక్తముగా అల్పసంఖ్యా కులు. కనుక ఈ క్రిమియను రిపబ్లికును సమితిలోనికి మార్చుట అహేతుకము, అనర్థకము.

మూడు, జనాభా సంఖ్యననుసరించికూడా ఆ రిపబ్లికు చిన్నదిగా నుండకూడదు. దానియందలిజనసంఖ్య 1,000,000 తగ్గకుండా దానిని మించియుండవలెను. ఎందువలన? ఒక స్వల్పమైన సోవియటు ప్రజాస్వామ్యము కొద్ది జనాభాతోను, అల్పసైన్యముతోను స్వతంత్ర ప్రభుత్వముగా నిల్చియుండు నని భావించుట గొప్ప పొరబాటు. అట్టి ప్రజాస్వామ్య మును సామ్రాజ్యవాద దోపిడిగాండ్రు అతి శీఘ్రకాలములోనే మ్రింగివేయుదురు. అటుల కాదనతలచుట వెఱ్ఱి.

ఈ మూడు ప్రకృతిసిద్ధలక్షణములు లేకుండినయెడల ఈ చరిత్రాత్మక కాలమందు, ఈస్వపరిపాలిత రిపబ్లికునుగాని, ఆ స్వపరిపాలిత రిపబ్లికుగాని సమితిశ్రేణిలోనికి మార్చుట యనర్థదాయకమని నా యభిప్రాయము.

4. తరువాత, 22, 23, 24, 25, 26, 27, 28, 29 నిబంధనలనుండి, సమితి రిపబ్లిక్కులలోని పరిపాలనా సౌకర్య మునకై పరగణాలగా జేసిన విభజనయొక్క సమగ్రవివరణ

మును వదలివేయుడని ప్రతిపాదన గలదు. నేను ఈ ప్రతిపాదనకూడా అంగీకరింపకూడదని కోరుచున్నాను. సం. సా. సా. రి. లో కొందరు మనుష్యులు సంతోషపూర్వకముగా విసుకులేకుండా ఈ భూభాగము నంతను రాష్ట్రములుగా పునస్సృష్టిజేయ తయారుగానున్నారు. కాని దానివలన పాలనా విధులయం దస్థిరత్వము గందరగోళము గలుగజేసినవార గుదురు. చిత్తుచట్ట మట్టి మనుజుల కాటంకమును గలిగించుచున్నది. ఇది చాలా యుత్తమమైనది. ఎందులకనగా, దీనియందును, తదితరగోళములందును, నిశ్చయత్వము, నిశ్చలత్వము, నిర్మలత్వము మనకత్యవసరము.

(5) ఐదవ సవరణ 33 ఆర్టికల్‌కు సంబంధించినది. రెండు సభలను సృష్టించుట అయుక్తమని కొందరుభావించి, జాతుల ఆలోచన సభను తీసివేయ ప్రతిపాదింప బడినది. ఈసవరణకూడా తప్పని నేను భావించుచున్నాను. సం. సా. సా. రి. ఒక జాతికి సంబంధించిన ప్రభుత్వమైనయెడల రెండు శాసనసభలకంటే ఏకసభాపద్ధతియే యుత్తమమైనది. కాని సం. సా. సా. రి. ఏకజాతీయప్రభుత్వము గాదు. మనకు తెలిసినట్లుగా సం. సా. సా. రి. అనేకజాతుల ప్రభుత్వము, సం. సా. సా. రి. నందలి కష్టజీవులయొక్క సామాన్యప్రయోజనములకు ప్రాతినిధ్యమిచ్చెడి శ్రేష్ఠమైన సాధనము యూనియిన్ కౌన్సిలు (Union council) జాతి, మత, భేదములు దాని కవసరము లేదు.

సం. సో. సో. రి. నందలి జాతులకున్న సామాన్య ప్రయోజనములుగాక, వారికి "ప్రత్యేకమైన, విశేషమైన" ప్రయోజనములు, వారి జాతీయలక్షణములకు సంబంధించినవి గలవు. ఈవిశేషప్రయోజనములను నిర్లక్ష్యము జేయ వీలగునా? అటుల వీలులేదు. ఈప్రత్యేక ప్రయోజనములను ప్రతిఫలింప జేయగల ఒక అత్యుత్తమ సంస్థకు ఆవశ్యకత గలదా? నిశ్చయముగా అది చాలా ఆవశ్యకమైనది. సం. సో. సో. రి. వంటి బహుజాతీయ ప్రభుత్వమును ఇట్టి సంస్థ లేకుండా పాలించుట అసాధ్యమనుట కేమాత్రము సందియము లేదు. ఈసంస్థయే రెండవ శాసనసభ; అది సం. సో. సో. రి. లోని జాతులఆలోచనసభ (council of nationalities)

యూరోపు, అమెరికా దేశమునందలి ప్రజాప్రతి నిధుల సభలయొక్క చరిత్ర యుదహరింపబడినది. ఈ దేశము లందలి రెండు సభలపద్ధతి వ్యతిరేక ఫలప్రదాయికమైనదనియు, సాధారణముగా రెండవసభ విప్లవ విద్రోహమునకు కేంద్రమగుననియు, అభివృద్ధి కాటంకమగుననియు, చెప్పబడినది. ఇది అంతయు సత్యము, అయితే, ఆదేశములందు, ఆ రెండు సభలు సమానమైనవి కాకపోవుటయే విపరీత ఫలమునకు కారణము. సర్వసాధరణముగా రెండవసభకు, క్రింది సభకంటె, ఎక్కువహక్కులు యివ్వబడుననను యంశమును జ్ఞాపకముంచుకొనవలెను. అప్పుడు, సాధారణముగా, పైనుండి దాని సభ్యులను నియమించుట మొదలైన అస్వాతంత్ర్య పద్ధతులచే ఈ రెండవ సభ నిర్మింపబడినది. ఆ రెండు సభలు అన్ని విధ

ములుగా సమానముగా నున్నయెడల, ప్రథమ సభనే ప్రజా స్వామ్య పద్ధతులతో నిర్మింపబడినదో, అట్టి పద్ధతులపైననే రెండవ సభనుకూడా నిర్మించినయెడల, ఈ వ్యతిరేక లక్షణ ములు లేకుండును.

(6) రెండు సభలకు సభ్యులు సమాన సంఖ్యగా నుండ వలెనని ఒక సవరణగలదు. ఈప్రతిపాదన నామోదింప వచ్చునని నేను తలచుచున్నాను. నా యుద్దేశ్యమందు, ఇది రెండు సభల సమానత్వమునునొక్కి వక్కాణించుచున్నది గనుక దానివలన స్పష్టముగా రాజకీయ లాభములుగలవు.

(7) సమితిసభకు ప్రత్యక్ష నియోజనముచే ప్రతినిధుల నెన్నుకొను విధముగానే జాతుల ఆలోచనసభకు కూడా ప్రతినిధులను ఎన్నుకొనవలెనను ప్రతిపాదనగలదు. ఈప్రతి పాదన కూడా అంగీకరింపవచ్చునని తలచుచున్నను. ఎన్నికల సమయమందది నిమిత్త మాత్రమైన యసౌకర్యములనుగలుగ జేయవచ్చును. కాని అది జాతుల ఆలోచనల సభయొక్క అధి కారమున కాధిక్యము గూర్చి ఒక రాజకీయ లాభమును గలి గించును.

(8) తరువాత 40 నిబంధన కొక సవరణగలదు. దాని వలన కేంద్రశాసనసభ (Supreme Council) యొక్క అధ్యక్ష పీఠము (Presi duim) నకు తాత్కాలిక శాసన నిర్మాణాది కారము యివ్వబడును. నేను ఈసవరణ తప్పనియు దీనినంగీకరింపకూడదనియు చెప్పుచున్నాను. ఒకనిర్ణీతమైన

సాధనమేగాక, అనేకసాధనములచే శాసనములుచేయుపద్ధతిని మనము నశింపజేయువలెను. అట్టి పరిస్థితులు, న్యాయసూత్ర నిశ్చలత్వమునకు వ్యతిరేకముగా నుండును. అదివరకంటె, యిప్పుడు, న్యాయసూత్ర నిశ్చలత్వమున కావశ్యకత గలదు. సం. సో. సో. రి. లో ఒక సాధనమే శాసన నిర్మాణాధికారము కలిగియుండవలెను. అది సం. సో. సో. రి యొక్క కేంద్ర శాసనసభ, (Supreme Council)

(9) తరువాత, రాజ్యాంగ విధానముయొక్క 40 వ నిబంధనకొక సవరణ గలదు. దానివలన సం.సో.సో.రి. యొక్క కేంద్ర శాసన సభాధ్యక్ష పీఠముయొక్క అధ్యక్షుడు. శాసన సభ్యులచే ఎన్నుకొన బడుటకు బదులుగా, దేశమందలి ప్రజలందరిచే ఎన్నుకొన బడవలెనని కోరబడినది. ఈ సవరణ తప్పు అని అభిప్రాయపడుచున్నాను. ఎందువలననగా అది మన రాజ్యాంగ విధానముయొక్క ఆశయముతో నేకీభవింపదు. మన చట్టము ప్రకారము, సం. సో. సో. రి. లో ఒక వ్యక్తిని, అధ్యక్షుడిగా ప్రజాబాహుళ్యముచే ఎన్నుకొన బడకూడదు. అట్టివాడు కేంద్రశాసన సభ్యులతో సమానుడగును కనుక అతడు వారికి ప్రత్యర్థిగా నుండవచ్చును. సం. సో. సో. రి. లోని అధ్యక్ష్యుని ఒక వ్యక్తిగాక ఒక సంఘము (కాలేజి) అనగా సామాన్యముచే ఎన్నుకొనబడక, కేంద్రశాసన సభ్యులచే ఎన్నుకొనబడును. వారికి బాధ్యుడై యుండును. అధ్యక్ష పీఠ మందలి తదితర సభ్యులనుకూడా కేంద్రశాసన సభ్యులు ఎన్ను కొందురు. ఇట్టి కేంద్రశాసన సభయొక్క నిర్మాణము అత్యు

త్మకమైన ప్రజాస్వామ్యసిద్ధాంతముపై యాధారపడియున్నది. అట్టిది యసంతృప్తికరమైన యనర్థములనుండి దేశక్షేమమునకు హానికారిగా యుండును.

(10) ఈ 40 వ ఆర్టికల్ కే మరొక సవరణ గలదు. అది ప్రతిసమితి రిపబ్లికునుండి పంపెడి యుపాధ్యక్షుల సంఖ్యను హెంపుజేయ గోరినది. ఈ సవరణను ఆమోదింపవచ్చును. ఎందువలననగా, అది పరిస్థితుల నభివృద్ధిజేయును. సం. సో. సో. రి. లోని కేంద్రశాసన సభాధ్యక్షపీఠముయొక్క యధికారమును బలపరచును.

(11) తరువాత 77 వ నిబంధనకొక సవరణగలదు అది ఒకనూతనమైన సర్వసమితి ప్రజాకార్య నిర్వాహక వర్గము నొకదానిని స్థాపింపగోరుచున్నది. దానివిధి రక్షణ పరిశ్రమ వృద్ధిజేయుట. ఈ సవరణనుకూడా ఆమోదింప వచ్చును. (హర్షధ్వానములు) ఎలననగా, మనరక్షణ పరిశ్రమను ప్రత్యేకించి ప్రజాయత్తముజేయు కాలమాసన్నమైనది. దానికి ప్రజలయొక్క కార్యనిర్వాహకవర్గ స్వస్వరూపమిచ్చే కాలమాసన్నమైనది. ఇది మన దేశముయొక్క రక్షణపనిని అభివృద్ధిపరని యభివృద్ధిచేసేదిగా నాకు కనబడుతుంది.

(12) తరువాత రాజ్యాంగవిధానములోని 124 వ నిబంధనకు మతాధికారులను రద్దుచేయుటను కోరుతూ ఒక సవరణకలదు. ఈ సవరణ రాజ్యాంగవిధానముయొక్క ఉద్దేశానికి వ్యతిరేకముగా ఉన్నది కాబట్టి దీనిని ఒప్పుకొనగూడదని నా ఉద్దేశము.

(13) కొంచెము యెంచుమించుగా ముఖ్యమైన స్వభావాలతో కూడుకునియున్న మరియొక సవరణఉన్నది. అది రాజ్యాంగవిధానము (చిత్తుచట్టము) లోని 135 వ నిబంధనకు సవరణ. మతాధికారులకు, పూర్వపు వైటుగార్డులు, సాంఘికముగా ఉపయోగకరమైన పనిచేయకుండాఉన్న యితరులకు, ఓటింగు అధికారమివ్వమని, లేక కొంత ఓటింగుఅధికారమును తగ్గించటము, అనగా యెన్నుకునే అధికారమేగాని యెన్నుకోబడే అధికారాన్ని లేకుండాచేయుట అని ఆసవరణ సూచిస్తుంది. ఈ సవరణనుకూడా ఒప్పుకోనకూడదని నేననుకుంటాను. శ్రమచేయనటువంటి, దోచుకునేటటువంటివారికి కొంతకాలమువరకు ఓటింగు అధికారములేకుండా సోవియట్ప్రభుత్వము చేసింది, కాని యెల్లకాలము కాదు, కొంతకాలమువరకే ఈ వ్యక్తులు, ఒకప్పుడు ప్రజలకువ్యతిరేకముగా యుద్ధముచేసి సోవియట్ చట్టాలకు వ్యతిరేంగా నడిచారు. వారినందరిని ఓటింగు అధికారములేకుండాచేసిన సోవియట్ చట్టమే తిరుగుబాటుకు సోవియట్ ప్రభుత్వము యొక్క సమాధానము. అప్పటినుంచి కొంతకాలము గడిచింది. గడచినకాలములో దోచుకొనేటటువంటి వర్గాలను నాశనము చెయ్యటములో మనము జయము పొందాము, సోవియట్ప్రభుత్వము అజేయమగు శక్తి అయింది.ఆచట్టాన్ని సవరణ చేయాల్సిన సమయము రాలేదా? ఆసమయమాసన్నమైనదని, నేననుకుంటాను. పూర్వపు వైటుగార్డులు, కులక్కులు మతాధికారులు మొదలగు సోవియట్ ప్రభుత్వ

విరోధులందరు దేశములోని పెద్దపెద్ద కమిటీలలోనికి రావచ్చు. కాబట్టి వారికి ఓటింగు అధికారము యివ్వటము అపాయమని చెప్పబడ్డది. కాని భయపడుటకు వారినిజపరిస్థితియేమిటి? నీవు తోడేళ్ళకు భయపడ్డట్టయితే అరణ్యాలకు దూరంగా ఉండు. (హర్షధ్వనులు మిన్నుముట్టినై) మొదటిది పూర్వపు కులక్కులు, వైటుగార్డులు, మతాధికారులందరు సోవియట్ ప్రభుత్వానికి విరోధులు కారు. రెండవది యెక్కడైనా ప్రజలు వారి విరోధులను యెన్నుకున్నట్టయితే, అది మన ప్రచారము యొక్క బలిహీనతను తెలియజేస్తుంది. అటువంటి అవమానానికి పూర్తిగా తగినవాళ్ళమే అని తెలియజేస్తుంది; మన ప్రచారము బోల్షివిక్కు పద్ధతిగా జరిగినట్టయితే పై కమిటీలకు ప్రజలు విరోధివ్యక్తులను యెన్నుకోరు. దీనిఫలితంగా, ఊరకే వాగకుండా పనిచేయాల్సిన అవసరం ఉంది. (హర్షధ్వనులు) పనిచెయ్యాల్సిన అవసరం ఉంది. రాజ్యాంగవిధాన నిర్ణయాలద్వారా ప్రతిది పూర్తిగాతయారై వస్తుందని అనుకొనకూడదు. 1919 కి పూర్వమే యెట్టి హద్దులు లేకుండా యుక్తవయస్కు లందరికి ఓటింగుహక్కు కాలమాసన్నమైనప్పుడు ప్రవేశపెట్టుట ప్రయోజనకరమని; సోవియట్ ప్రభుత్వము కొంతకాలము గడచిన తరువాత ఆలోచింపవచ్చుననియు లెనిన్ చెప్పెను. యేహద్దులు లేకుండా అనేది గుర్తించుడు. మన వ్యవసాయము, పరిశ్రమ అధోగతిలో నున్నప్పుడు, విదేశీసైనికదాడి అంతరించక

మునుపే లెనిన్ యీవిధంగా చెప్పెను. అప్పటినుంచి 17 సంవత్సరాలు గడచిపోయినై. స్నేహితులారా! లెనిన్ యొక్క ఆసూచనను పూర్తిజేయుకాలము ఆసన్నము కాలేదా? ఆసమయము సమీపించినదని నేననుకుంటాను.

యూనియన్ ఆఫ్ సోవియట్ సోషలిస్టురిపబ్లిక్ యొక్క రాజ్యాంగవిధానములోని చిత్తుచట్టమునకున్న సవరణలు, ప్రతిపాదనలు యీవిధముగా నున్నవి.

5 నెలలపాటు దేశమంతటా జరిగిన చర్చలఫలితంగా యీ కాంగ్రెసు యీచిత్తుచట్టమును ఆమోదించునని నేనను కుంటాను. (హర్షధ్వనులు)

ఇప్పటినుంచి కొద్దిరోజులలోపల సోవియట్ యూని యన్, విశాలమైన సోషలిస్టు ప్రజాస్వామ్య సిద్ధాంతాల మీద ఆధారపడిన సోషలిస్టు రాజ్యాంగవిధానాన్ని పొందు తుంది. యు. యస్. యస్. ఆర్. లో సోషలిజమ్‌యొక్క విజయాన్ని కాపిటలిష్టులయొక్క బానిసత్వాన్నుండి శ్రమజీవు లను తప్పించటాన్నిగురించి, యు. యస్. యస్, ఆర్. లో తుదివరకు సరిఅయిన ప్రజాస్వామ్యము జయము పొందటాన్ని గురించి క్లుప్తంగాను, తేలికగాను చెప్పేటటువంటి చరిత్రా త్మకమైన పత్రమై యుండును.

పెట్టుబడిదారీ దేశాలలోని లక్షలకొలది పెద్దమను ష్యులు కలలు కనినటువంటి, కంటున్నటువంటి దానిని

యు. యస్. యస్. ఆర్. లో యిదివరకే సంపాదింపబడ్డది అని తెలియజేసే పత్రముగా ఉంటుంది. (హర్షధ్వానులు)

యు. యస్. యస్. ఆర్ లో యేది అయితే సంపాదింప బడ్డదో అది యితర దేశాలలోకూడా పూర్తిగా సంపాదింపబడ గలదుఅని తెలియజేసే పత్రముగా ఉంటుంది (హర్షధ్వానులు.)

యు. యస్. యస్. ఆర్ యొక్క నూతన రాజ్యాంగ విధానముయొక్క అంతర్జాతీయ ప్రాముఖ్యతకు యెక్కువ అంచనా వేయకూడదు.

ఫాసిజమ్ అనేపెద్దఅల కార్మిక వర్గముయొక్క సోష లిష్టు ఉద్యమాన్ని నికృతరూపంగా తయారు చేస్తూన్నటువంటి, నాగరిక ప్రపంచమందలి ప్రజలయొక్క ప్రిజాస్వామ్య అభి ప్రాయాలను పాడుచేస్తున్నటువంటి సమయంలో యు. యస్. యస్. ఆర్. యొక్క నూతన రాజ్యాంగ విధానము ఫాసిజమ్‌కు వ్యతిరేకమైనదెబ్బగాఉంటుంది. సోషలిజము, ప్రజాస్వామ్యము జయింపరానివని చెప్పేటటువంటిదెబ్బ, క్రూరాత్వానికి వ్యతి రేకంగా పోరాటంసల్పుతున్న ప్రజలకు యు. యస్. యస్. ఆర్. యొక్క నూతన రాజ్యాంగ విధానమునైతిసహాయ్యము, నిజమైన సహాయ్యము నిచ్చేదిగా ఉంటుంది. (హర్షధ్వానులు)

యు. యస్. యస్. ఆర్. యొక్క నూతన రాజ్యాంగ విధానము పెట్టుబడిదారి దేశాలలోని ప్రజలకు కార్యాచరణ విధానమునుగురించిన సూచనలిచ్చేది అయినట్లయితే, యు. యస్. యస్. ఆర్. లోని ప్రజలకు పోరాటాన్ని

గురించినటువంటి, మానవ స్వతంత్రవిజయాలను గురించినటువంటి క్లుప్తమైన ప్రాముఖ్యతను తెలియ జేస్తుంది. కంటకావృతమగు పోరాట పంథాయొక్క ఫలితంగా మనము జయించిన ఫలితాలను సూచించే శాసనాన్ని కలిగి ఉండటము మన ప్రజలు దేనికొరకు పోరాడారో అటువంటి ప్రపంచ విఖ్యాతమైన, చరిత్రాత్మకమైన జయాన్ని పొందటము చాలా సంతోషము, ఆనందదాయకము. మన ప్రజలచేత ప్రవహింపబడ్డ రక్తము వృథాపోలేదని, దాని ఫలితాన్నిచ్చిందని వినటము చాలా సంతోషకరము. (యెక్కువగా చేయబడ్డ హర్ష ధ్వనులు) మనయొక్క కార్మికులను, కర్షకులను, శ్రమ చేయుచున్న విద్యావంతులను యిది నైతికంగా సాయుధులను చేయును. స్వభావసిద్ధమైన ఆధిక్యతను ముందుకుతీస్తుంది. కమ్యూనిజముయొక్క నూతనవిజయాలకై చేయబడే నూతన పోరాటాలకు శక్తులన్నింటిని కేంద్రీకరించుటలో తనకున్న శక్తిలో నమ్మకాన్ని బలపరుస్తుంది.

